ఓమ్.

# భగవద్గీతా

ఆంధ్ర టీకాతాత్పర్య సహితము

బ్రహ్మశ్రీ

కాళహస్తి. సుబ్రహ్మణ్యశాస్త్రులు గారిచే

ఆదిసరస్వతీనిలయ ముద్రాక్షరశాలయందు

ముద్రింపించి ప్రకటింపఁబడియె.

తండియార్పేట, చన్నపట్టణము

1907



[Rs 1-4-0

# పీఠిక

భరతఖండంబునందు భారతాంతర్గతమై శ్రీకృష్ణార్జున సంవాదరూపమై ప్రస్థానత్రయంబులలో నొక్కటియై అధ్యాత్మవిద్యాబోధకమై వెలయు భగవద్గీతలకు శ్రీమచ్ఛంకర భగవత్పాదాది మహాపురుషులనేకులు వ్యాఖ్యానములు గావించియున్నారు. వానిలో శ్రీ వాసుదేవ యతీంద్రుల శిష్యులగు శ్రీరామచంద్రానంద సరస్వతీ స్వాములవారు రచియించిన వ్యాఖ్యానము సుబోధమై తనరారుచున్నయది. అద్దాని ననుసరించి యాంధ్రంబునం గేమహనీయుండొక టీకా తాత్పర్యమును రచియించియున్నాడు. ఇదియు నాగీర్వాణ వ్యాఖ్యానప్రకారము సులలితమై యున్నది. దీని ననేక పుస్తక వ్యాపారులిదివరలో ముద్రింపించియున్నారుగాని అదెంతయు సమంజసముగా నుండలేదు గనుక నేనిప్పుడా రామచంద్రానంద సరస్వతీ స్వాముల గీర్వాణ వ్యాఖ్యానము ననుసరించి తెనుగునంగల తాత్పర్యముల సంస్కరించి చిన్నసైజున మంచి కాగితములలో ముద్రించి శ్రీకృష్ణార్జున రథ సహితముగా బంగారు బిల్లతో గూడిన మంచి బైండుచేయించి సకలజనులును గొనందగిన సులభక్రయముంచి ప్రకటించియున్నాడను.

ఇట్లు,

విద్వజ్జనవిధేయుడు,

కాళహస్తి - సుబ్రహ్మణ్యశాస్త్రి

కావలి.
నెల్లూరుజిల్లా.
1—5—07.

ఓమ్

## శ్రీమద్గురు ధ్యాన ప్రకారః.

వందే గురూణాం చరణారవిందే సందర్శితస్వాత్మసుఖావబోధే, జనస్య యే జాంగలికాయమానే సంసారహాలాహలమోహశాంత్యై. వందే గురుపదద్వంద్వ మవాఙ్మానసగోచరమ్, రక్తశుక్లప్రభామిశ్ర మతర్క్యం త్రైపురం మహః,

## శ్రీభగవద్గీతా పూర్వపీఠికా.

లక్ష్మీనాథసమారంభాం నాథయామునమధ్యమామ్, అస్మదాచార్యపర్యంతాం వందే గురుపరమ్పరామ్. 1. అస్మద్గురు సమారబ్ధాం నాథయామున మధ్యమామ్, లక్ష్మీవల్లభపర్యంతాం వందేగురుపరంపరామ్. 2.

ఇత్యాది తత్తత్సంప్రదాయానుగుణం గురు పరంపరాను
సంధానానంతరం అనుసంధేయ

## స్తోత్రశ్లోకాః.

శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజమ్, ప్రసన్న వదనం ధ్యాయేత్సర్వవిఘ్నోపశాంతయే. 3. యస్యద్విరద వక్త్రాద్యాః పారిషద్యాః పరశ్శతమ్, విఘ్నంనిఘ్నంతిసతతం విష్వక్సేనంత మాశ్రయే. 4. సవ్యాఖ్యానయుక్ఛాఖేన మహా

తా భారతేనచ, ఉపబృంహిత వేదాయ నమోవ్యాసాయవిష్ణ
వే. 5. వ్యాసం వశిష్ఠనప్తారం శక్తేఃపౌత్రమకల్మషమ్, పరా
శరాత్మజంవందే శుకతాతం తపోనిధిమ్. 6. వ్యాసాయ వి
ష్ణురూపాయ వ్యాసరూపాయవిష్ణవే, నమోవై బ్రహ్మనిధయే
వాసిష్ఠాయ నమోనమః. 7. మునింస్నిగ్ధాంబుదాభాసం వే
దావ్యాసమకల్మషమ్, వేదవ్యాసం సరస్వత్యావాసంవ్యాసం
నమామ్యహమ్. 8. అచతుర్వదనో బ్రహ్మా ద్విబాహురపరో
హరిః, అఫాలలోచనశ్శంభు, ర్భగవాన్ బాదరాయణః. 9.
కృష్ణంకమలపత్రాక్షం పుణ్యశ్రవణకీర్తనమ్, వాసుదేవంజ
గద్యోనిం నౌమినారాయణం హరిమ్ 10. కృష్ణాయయాదవ
వేంద్రాయ జ్ఞానముద్రాయయోగినే, నాథాయరుక్మిణీశాయ
నమోవేదాంతవేదినే. 11. ప్రపన్నపారిజాతాయ వేత్రతో
త్రైకపాణయే, జ్ఞానముద్రాయ కృష్ణాయ గీతామృతదుహే
నమః. 12. సారథ్యమర్జునస్యాజౌ కుర్వన్ గీతామృతం ద
దౌ, లోకత్రయోపకారాయ తస్మైకృష్ణాత్మనే నమః. 13. స
ర్వోపనిషదోగావో దోగ్ధా గోపాలనన్దనః, పార్థోవత్స సుధీ
ర్భోక్తా దుగ్ధంగీతామృతం మహత్. 14.

### శ్రీ భగవద్గీతా మాహాత్మ్యమ్.

పార్థాయ ప్రతిపాదితాంభగవతానారాయణేనస్వయం,

వ్యాసేనగ్రథితాంపురాణమునినామధ్యేమహాభారతమ్, అద్వైతామృతవర్షిణీం భగవతీ మష్టాదశాధ్యాయినీ, మమ్బత్వామనుసందధామి భగవద్గీతేభవద్వేషిణీమ్. 15. గీతాశాస్త్రమిదంపుణ్యం యఃపఠేత్ప్రయతఃపుమాన్, విష్ణోఃపదమవాప్నోతి భయశోకాదివర్జితః. 16. భారతామృతసర్వస్వం విష్ణోర్వక్త్రాద్వినిస్సృతమ్, గీతాగంగోదకం పీత్వాపునర్జన్మనవిద్యతే. 17. గీతాసుగీతాః కర్తవ్యాఃకిమన్యైశ్శాస్త్రసంగ్రహైః, యాస్స్వయం పద్మనాభస్య ముఖపద్మాద్వినిస్సృతాః. 18. గీతాధ్యయనశీలస్య ప్రాణాయామపరస్యచ, నైవ సంతిహి పాపాని పూర్వజన్మకృతాన్యపి. 19, అకృత్యమపికుర్వాణో భుంజానోవాయతిస్తతః, ఘోరంవైవస్వతస్థానంగీతాధ్యాయీనపశ్యతి. 20. మలనిర్మోచనం పుంసాం జలస్నానం దినేదినే, సకృద్గీతాంభసిస్నానం సంసారమలమోచనమ్. 21. శ్లోకమేకం తదర్ధంవా పాదంపాదార్ధమేవవా, నిత్యం పఠతిభక్త్యాయ స్సమోక్షమధిగచ్ఛతి. 22. సర్వశాస్త్రమయీగీతా సర్వవేదమయోహరిః, సర్వతీర్థమయీ గంగా సర్వధర్మమయోమనుః. 23. ఏకం శాస్త్రం దేవకీపుత్రగీతం ఏకోదేవో దేవకీపుత్రఏవ, ఏకోమంత్రో దేవకీపుత్రనామ కర్మాప్యేకం దేవకీపుత్రసేవా, 24.

## అథన్యాసః.

అస్య శ్రీభగవద్గీతా శాస్త్రమహామంత్రస్య- శ్రీవేదవ్యా
సః భగవాన్నృషి -అనుష్టుప్ఛందః-శ్రీకృష్ణః పరమాత్మా దేవ
తా, అశోచ్యానన్వశోచస్త్వమితిబీజం - సర్వధర్మాన్పరిత్యజ్య
మామేకం శరణం వ్రజేతిశక్తిః- అహంత్వా సర్వ పాపేభ్యో
మోక్షయిష్యామి మాశుచ ఇతికీలకమ్; మచ్చిత్త స్సర్వదు
ర్గాణి మత్ప్రసాదాత్తరిష్యసీతి కవచమ్, కిరీటినంగదినంచక్ర
హస్తమిత్యస్త్రమ్, అనాదిమధ్యాంతమనంత వీర్యమితిధ్యా
నమ్. జ్ఞానయజ్ఞేన భగవదారాధనార్థే గీతాపారాయణేజ
పేవా వినియోగః, జ్ఞానాత్మనే శ్రీకృష్ణాయ అంగుష్ఠాభ్యాం న
మః, ఐశ్వర్యాత్మనే గోవిందాయ తర్జనీభ్యాంనమః, శక్త్యాత్మ
నే వేదవ్యాసాయ మధ్యమాభ్యాంనమః, బలాత్మనేబలభద్రా
య అనామికాభ్యాం నమః, తైజసాత్మనే వాసుదేవాయ కని
ష్ఠికాభ్యాంనమః, విజయాత్మనే గాండీవధన్వనే అర్జునాయ
కరతల కరపృష్ఠాభ్యాంనమః, జ్ఞానాత్మనే శ్రీకృష్ణాయ హృద
యాయనమః, ఐశ్వర్యాత్మనే గోవిందాయ శిరసే స్వాహా. శ
క్త్యాత్మనే వేదవ్యాసాయ శిఖాయైవషట్. బలాత్మనే బలభ
ద్రాయ కవచాయహుమ్, తైజసాత్మనే వాసుదేవాయ నేత్ర
త్రయాయవౌషట్, విజయాత్మనే గాండీవధన్వనే అర్జునాయ

త్రవేత్రైకపాణయే, జ్ఞానముద్రాయ కృష్ణాయ గీతామృతదు
హే నమః. 3. వాచకః ప్రణవో యస్య కృష్ణ స్తస్యాఖిలంజగత్,
శుశ్రితిరాజ్ఞావపుర్జ్ఞానం తం వందే దేవకీసుతం. 4. సర్వోప
నిషదో గావో దోగ్ధా గోపాలనందనః, పార్థో వత్స స్సుధీర్భోక్తా
దుగ్ధం గీతామృతం మహత్. 5. వసుదేవసుతం దేవం కంస
చాణూరమర్దనమ్. దేవకీ పరమానందం కృష్ణంవందే జగద్గు
రుమ్. 6. భీష్మద్రోణతటా జయద్రథజలా గాంధారనీలోత్పలా
శల్యగ్రాహవతీ కృపేణ వహనీ కర్ణేన వేలాకులా, అశ్వత్థామవి
కర్ణ ఘోరమకరా దుర్యోధనావర్తినీ సోత్తీర్ణాఖలు పాండవై
రణనదీ కైవర్తకే కేశవే. 7. పారాశర్య వచఃసరోజ మమలం
గీతార్థగంధోత్కటం నానాఖ్యానక కేసరం హరికథా సద్భాను
నాబోధితమ్, లోకే సజ్జనషట్పదై రహరహః పేపీయ మానం
ముదా భూయాద్భారత పంకజం కలిమల ప్రధ్వంసి న శ్శ్రే
యసే. 8. మూకం కరోతి వాచాలం పంగుం లంఘయతేగి
రిమ్, యత్కృపాత మహం వందే పరమానందమాధవమ్. 9.

యం బ్రహ్మా వరుణేంద్ర రుద్రమరుతః స్తున్వంతి దివ్యైః
స్తవైర్వేదైః సాంగపద క్రమోపనిషదై ర్గాయంతియం సామ
గాః। ధ్యానావస్థిత తద్గతేనమనసా పశ్యంతియంయోగినోయ
స్యాంతం న విదు స్సురాసురగణా దేవాయతస్మైనమః. 10.

అతః పరః యథాహార్ణం సమ్పూజ్య పారాయణాదికం కార్యమ్.

→⊙←

శ్రీ ర స్తు.

శ్రీకృష్ణాయనమః.

శ్రీ భగవద్గీతా ప్రారంభః.

అర్జున విషాదయోగోనామ ప్రథమోధ్యాయః.

---

ధృతరాష్ట్ర ఉవాచ.

మూలమ్. ధర్మక్షేత్రే కురుక్షేత్రే సమవేతా యుయుత్సవః।
మామకాఃపాండవాశ్చైవ కిమకుర్వత సంజయ. 1.

టీక. హే సంజయ- ఓయి సంజయుడా; ధర్మక్షేత్రే- పుణ్యభూమి యైన; కురుక్షేత్రే- కురుక్షేత్రమునందు; మామకాః- నా కుమారులయిన దుర్యోధనాదులు; పాండవాశ్చైవ- పాండురాజుకుమారులయిన ధర్మరాజాదులును; యుయుత్సవః- యుద్ధముచేయనిశ్చయించిన వారలై; సమవేతాస్సంతః- కూడినవారలై; కిం- ఏమి; అకుర్వత- చేసిరి. అని ధృతరాష్ట్రుండడిగెను.

ధృతరాష్ట్రుండడిగెను. ఓయి సంజయుడా పుణ్య భూమి యైన కురుక్షేత్రమునందు యుద్ధముచేయుటకై చేరిన నాకొడుకులయిన దుర్యోధనాదులును పాండవులును ఏమి చేసిరి?

అవతరణిక. ఇట్లు ధృతరాష్ట్రుండడుగగా సంజయుండు చెప్పుచున్నాడు.

సంజయ ఉవాచ.

దృష్ట్వాతు పాండవానీకం వ్యూఢం దుర్యోధన స్తదా।
ఆచార్య ముపసంగమ్య రాజా వచన మబ్రవీత్. 2.

రాజా- రాజైన; దుర్యోధనః- దుర్యోధనుడు; వ్యూఢం- వ్యూహాకారముగా రచింపబడిన; పాండవానీకం- పాండవసైన్యమును; దృష్ట్వాతు-చూచినంతనె; తదా-అప్పుడు;ఆచార్యం- ఆచార్యులనుగూర్చి;ఉపసంగమ్య-సమీపమునుబొంది;వచనం- వాక్యమును; అబ్రవీత్- పలికెను.

అందుకు సంజయుం డిట్లనెను. అప్పుడు దుర్యోధనుడు వ్యూహములుగా పన్ని నిలిచిన పాండవుల సేననుజూచి ద్రోణాచార్యుల యొద్దకుం బోయి యీమాటను చెప్పెను.

అవతరణిక. ఆ ద్రోణాచార్యులతో దుర్యోధనుండు చెప్పిన వాక్యములనుతొమ్మిది శ్లోకములచేతసంజయుడు చెప్పుచున్నాడు.

పశ్యైతాంపాండుపుత్రాణా మాచార్యమహతీంచమూమ్।
వ్యూఢాం ద్రుపద పుత్రేణ తవశిష్యేణధీమతా. 3.

హే ఆచార్య- ఓ ద్రోణాచార్యుడా; తవ- నీకు; శిష్యేణ- శిష్యుడును; ధీమతా- బుద్ధిమంతుడైన; ద్రుపదపుత్రేణ- ద్రుపద

రాజ కుమారుడయిన ధృష్టద్యుమ్నునిచేత; వ్యూఢాం- వ్యూహాకారముగా రచియింపబడిన; మహతీం- అధికమైన; పాండుపుత్రాణాం- పాండవులయొక్క; ఏతాం- ఈ; చమూం- సేనను; పశ్య- చూడుమా.

ఆచార్యా! ఇదిగో పాండవులదైన గొప్పసేన నీశిష్యుడును బుద్ధిమంతుడు నగు ధృష్టద్యుమ్నుని చేత వ్యూహముఖముగా తీర్పబడియున్నవి, చూడుము.

అత్ర శూరా మహేష్వాసా భీమార్జునసమా యుధి।
యుయుధానో విరాటశ్చ ద్రుపదశ్చ మహారథః॥ 4.

అత్ర- ఈ పాండవ సేనయందు; మహేష్వాసాః- మంచిజయశీలములయిన విండ్లుగలవారలును; యుధి-యుద్ధరంగమునందు; భీమార్జునసమాః - భీమార్జునులతో సమానులైన; శూరాః-వీరులు; సంతి-కలరు; (వారలెవ్వరనిన) యుయుధానః - సాత్యకియు; విరాటశ్చ- విరాటుండును; మహారథః- మహారథికుడైన; ద్రుపదశ్చ-ద్రుపదరాజును; మహారథికలక్షణము. "శ్లో॥ ఏకాదశ సహస్రాణి యోధయేద్యస్తు ధన్వినాం। శస్త్రశాస్త్రప్రవీణస్తు మహారథ ఇతిస్మృతః॥ అమితాన్ యోధయేద్యస్తు సంప్రోక్తోఽతిరథస్తు సః। సమస్త్వేకేన యోద్ధా తస్యాన్యోఽర్ధరథోమత ఇతి." పదునొకండువేల విలుకాండ్రతో యుద్ధము

చేయు సామర్థ్యముగల శస్త్రశాస్త్ర ప్రవీణుడయినవాడు మహారథికుడనంబడును, అపరిమిత రథికులతో యుద్ధము చేయువాడు అతిరథుడనం బడును, ఒక రథికునితో యుద్ధము చేయువాడు సమరథుడనం బడును, ఆ సమరథునికంటే తక్కువయైనవాడు అర్ధరథుడనంబడును.

ఈ పాండవసేనలో యుద్ధమున భీమార్జునులతో సమానులైన శూరులున్నారు. సాత్యకియును, విరాటుడును, మహారథుడైన ద్రుపదుడును.

ధృష్టకేతు శ్చేకితానః కాశీరాజశ్చ వీర్యవాన్।
పురుజి త్కుంతిభోజశ్చ శైబ్యశ్చ నరపుంగవః. 5.

ధృష్టకేతుః- ధృష్టకేతువనెడు రాజును; చేకితానః- చేకితానుడును; వీర్యవాన్ - పరాక్రమశాలియైన; కాశీరాజశ్చ- కాశీరాజును; పురుజిత్- పురుజిత్తనెడి రాజును; కుంతిభోజశ్చ- కుంతిభోజుడును; నరపుంగవః- నరశ్రేష్ఠుడైన; శైబ్యశ్చ- శైబ్యుడును.

ధృష్టకేతువును, చేకితానుడును, పరాక్రమశాలియైన కాశీరాజును, పురుజితుడును, కుంతి భోజుడును, పురుషశ్రేష్ఠుడగు శైబ్యుడును.

యుధామన్యుశ్చ విక్రాంత ఉత్తమౌజాశ్చ వీర్యవాన్।
సౌభద్రో ద్రౌపదేయాశ్చ సర్వఏవ మహారథాః. 6.

విక్రాంతః-వీరుడైన- యుధామన్యుశ్చ- యుధామన్యుడును; వీర్యవాన్- పరాక్రమవంతుడయిన; ఉత్తమౌజాశ్చ- ఉత్తమౌజుడును; సౌభద్రః- అభిమన్యుడును; ద్రౌపదేయాశ్చ- ధర్మజ భీమార్జున నకుల సహదేవులకు ద్రౌపదియందు వేర్వేరుగ బుట్టిన ప్రతివింధ్యాదులును, యీవిషయము శ్రీభాగవతమందు జెప్పబడియున్నది. అదియెట్లనిన. "శ్లో॥ ద్రౌపద్యాం పంచపంచభ్యః పుత్రాస్తె పితరోభవన్। ధర్మజాత్ప్రతివింధ్యో భూ చ్ఛ్రుతసోమో వృకోదరాత్। అర్జునాచ్ఛ్రుతకీర్తిస్తు శతానీకస్తునాకులిః।సహదేవసుతో రాజన్ శ్రుతసేనస్తథాపరఇతి." ధర్మరాజు వలన ప్రతివింధ్యుఁడును, భీమునివలన శ్రుతసోముఁడును, అర్జునుని వలన శ్రుతకీర్తియు, నకులుని వలన శతానీకుడును, సహదేవునివలన శ్రుతసేనుఁడును, ద్రౌపది గర్భంబునబుట్టిరని చెప్పబడియున్నది. కావుననీఅయిదుగురును, సర్వే-పూర్వమందు చెప్పబడినవారలందరును; మహారథాః-మహారథికులు.

పరాక్రమముగల యుధామన్యుడును, బలవంతుడయిన ఉత్తమౌజుడును, అభిమన్యువును ద్రౌపది కొడుకులును వీరలందఱు మహారథులు.

అస్మాకంతు విశిష్టాయే తాన్నిబోధ ద్విజోత్తమ।
నాయకా మమసైన్యస్య సంజ్ఞార్థంతాన్ బ్రవీమితే. 7.

హేద్విజోత్తమ- ఓ బ్రాహ్మణశ్రేష్ఠుడయిన ద్రోణాచార్యుడా; యే- ఎవరు; మమ-నాయొక్క; సైన్యస్య-సేనకు; నాయకాః-రక్షకులో; తాన్-వారలను; తే-నీకు; సంజ్ఞార్థం- తెన్నుగా తెలియుటకొరకు; బ్రవీమి-చెప్పుచున్నాను; యేతు- ఎవరైతే; అస్మాకం-మన సంబంధులయినవారిలలో; విశిష్టాః-కార్యముచేత శ్రేష్ఠులో; తాన్-వారిని; నిబోధ- తెలిసికొనుము.

బ్రాహ్మణోత్తముడా! మనలో నాసేనకు నాయకులను ఉత్తములైన వారిని స్పష్టముగా తెలియుటకొఱకై నీకుజెప్పెద వినుము.

అవతారిక. అట్టివారిని రెండుశ్లోకములచే చెప్పుచున్నాడు.

భవాన్భీష్మశ్చ కర్ణశ్చ కృపశ్చ సమితింజయః।
అశ్వత్థామా వికర్ణశ్చ సౌమదత్తి స్తథైవచ. 8.

భవాన్-నీవును; భీష్మః- భీష్ముడును; కర్ణశ్చ-కర్ణుడును; సమితింజయః-యుద్ధమందు జయశీలుడయిన; కృపశ్చ- కృపాచార్యుడును; అశ్వత్థామా-అశ్వత్థామయును; వికర్ణశ్చ-వికర్ణుడును; తథైవచ-అలాగుననే; సౌమదత్తిః-సోమదత్తుని కుమారుడయిన భూరిశ్రవుడును.

నీవు, భీష్ముడు, కర్ణుడు, కృపాచార్యుడు, అశ్వత్థామ, వికర్ణుడును భూరిశ్రవుడును వీరలు మన సేనలో ముఖ్యులు.

అన్యేచ బహవశ్శూరా మదర్థే త్యక్తజీవితాః।
నానాశస్త్రప్రహరణా స్సర్వేయుద్ధ విశారదాః. 9.

మదర్థే-నాప్రయోజన నిమిత్తమై; త్యక్తజీవితాః-త్యక్త, విడువబడుచున్న; జీవితాః- ప్రాణములు గలవారును; బహవః-అనేకులయిన; అన్యేచ-ఈచెప్పబడినవారికంటె మిగిలిన జయద్రథాదులును; సర్వే-వీరలందఱును; శూరాః-శూరులును; నానాశస్త్రప్రహరణాః, నానా- అనేక ప్రకారములయిన, శస్త్ర- ఆయుధవిశేషములును, ప్రహరణాః- సాధనములును గల వారలును; యుద్ధవిశారదాః- యుద్ధ-యుద్ధమునందు,విశారదాః-నేర్పుగలవారును.

ఇంకనితరులు శూరులైన వారు పెక్కండ్రు నానావిధములయిన ఆయుధములచే యుద్ధము సేయుటయందు సమర్థులైన వారలు నానిమిత్తమై ప్రాణములనైనను విడువ నిశ్చయించియున్నారు.

అపర్యాప్తం తదస్మాకం బలం భీష్మాభి రక్షితం।
పర్యాప్తం త్విదమేతేషాం బలం భీమాభి రక్షితం. 10.

తదపి-అట్టివరాక్రమవంతులు మనకైనిరులయ్యును; భీష్మాభి

రక్షితం- భీష్మ- భీష్మాచార్యులచేత, అభిరక్షితం- అంతట రక్షింపబడుచున్న; అస్మాకం,మనయొక్క; బలం.సైన్యము; అపర్యాప్తం. సంపూర్ణముగాక యున్నది. (కావున పాండవులజయింపజాలనని తోచుచున్నది.) ఏతేషామ్,యీపాండవులయొక్క, బలంతు, సైన్యమైతే భీమాభిరక్షితం సత్, భీమ, భీమునిచేత, అభిరక్షితంసత్, అంతట రక్షింపబడుచున్నదై; పర్యాప్తం, సంపూర్ణముగానున్నది.

అట్లు అనేకులు శూరులున్నను భీష్మునిచేరక్షింపబడ్డ మనసేన సంపూర్ణముకాకయున్నది. పాండవులసైన్యమో భీమునిచేత రక్షింపబడినదై సంపూర్ణమైయున్నది.

అయనేషుచ సర్వేషు యథాభాగ మవస్థితాః।
భీష్మ మేవాభి రక్షంతు భవంత స్సర్వఏవహి. 11.

సర్వేభవంతః. మీరందఱును; సర్వేషు,సమస్తములయిన; అయనేషుచ- వ్యూహప్రదేశమార్గములయందు; యథాభాగం తమకు నిర్ణయింపబడియున్న యుద్ధభూమినతిక్రమించక; అవస్థితాస్సంతః, ఉన్న వారగుచు; భీష్మమేవ,భీష్మాచార్యులనే; అభిరక్షంతు, అంతట రక్షింతురుగాక. ఓయీ మేము భీష్మునిరక్షించునంతవారమాఅని యడిగితిరేని, వెనుకకుదిరుగక యెదుటనుండెడి యోధులతో యుద్ధముచేయుచుండగా వారలెదుట

నిలువబాలక వంచన జేసి వెనుకపార్శ్వమునకువచ్చి నొప్పింతురు. కావున నట్లుగాకయుండునట్లు రక్షింపవలయుననుట. భీష్ముని రక్షింపం బనియేమనఁ దనినవారిబలముచేతనే మనము జీవనంతులమైయున్నామని భావము.

మీరందఱును వ్యూహమునందు ఆ యా ప్రదేశములందంతటను మీ మీ స్థానములయందు తప్పక కాచియున్నవారలై భీష్మునిమాత్రము అన్ని పార్శ్వములందును రక్షింపవలెను.

అవతారిక. ఇట్లు సన్మానపురస్సరమైన దుర్యోధనుని వాక్యమునాకర్ణించి భీష్ముఁడేమిచేసెనని ఆకాంక్షగలుగగా సంజయుండు జెప్పుచున్నాడు.

తస్య సంజనయన్ హర్షం కురువృద్ధః పితామహః।
సింహనాదం వినద్యోచ్చైః శంఖం దధ్మౌ ప్రతాపవాన్. 12.

ప్రతాపవాన్- పరాక్రమశాలియును; కురువృద్ధః- కురుశ్రేష్ఠుడైన; పితామహః-భీష్మాచార్యుడు;తస్య- పూర్వోక్తప్రకారముగా స్తోత్రము జేయుచున్న ఆ దుర్యోధనునకు; హర్షం- సంతోషమును; జనయన్- పుట్టించుచు; ఉచ్చైః- గట్టిగా;సింహనాదం- సింహనాదమును; వినద్య- ధ్వనింపజేసి; శంఖం- శంఖమును; దధ్మౌ- పూరించెను.

అట్లు చెప్పుచున్న దుర్యోధనునకు సంతోషము గలిగించు

వాడై కురువృద్ధుడగు భీష్ముడు గట్టిగా సింహనాదముచేసి శం
ఖము పూరించెను.

తత శ్శంఖాశ్చ భేర్యశ్చ పణవానక గోముఖాః।
సహసై వాభ్య హన్యంత సశబ్దస్తుములో౽భవత్. 13.

తతః- ఆ సేనానాయకుడయిన భీష్మునిచేత జేయబడిన సింహ
నాదశంఖ ధ్వానానంతరమందు కౌరవసైనికులచేత; శంఖాశ్చ-
శంఖములును, భేర్యశ్చ-భేరులును, పణవానకగోముఖాః- పణవ
పణవములనడి సూక్ష్మ మృదంగ విశేషములును, ఆనక- స్థూల
వాద్యవిశేషములును, గోముఖాః- సంగీతానుసారములయిన మ
ర్దలవిశేషములును; సహసైన- శీఘ్రముగానే; అభ్యహన్యంత-
వాయింపబడినవి; సశబ్దః- ఆవాద్యములవలన బుట్టినశబ్దము. తు
ములః- సంకులమైనది; అభవత్- ఆయెను.

అటుపిమ్మట కౌరవసైనికులు శంఖములను భేరులను తప్పె
ట మొదలగువానిని శీఘ్రముగా వాయించిరి. దానిచే గొప్ప
ధ్వని కలిగెను.

తత శ్శ్వేతై ర్హయై ర్యుక్తే మహతి స్యందనే స్థితౌ।
మాధవః పాండవశ్చైవ దివ్యౌశంఖౌ ప్రదధ్మతుః. 14.

తతః- ఆవాద్యధ్వానాంతరమందు; శ్వేతైః- తెల్లనైన; హ

హైః- గుఱ్ఱములతోడ; యుక్తే- కూడిన; మహతి- శ్రేష్ఠమైనట్టి స్యందనే- రథమునందు, స్థితౌ- ఉన్నట్టి; మాధవః- కృష్ణుడును, పాండవశ్చ- అర్జునుడును, దివ్యౌ- ప్రకాశించుచున్న, శంఖౌ- శంఖములను, ప్రదధ్మతుః- లెస్సగా పూరించిరి.

అంత కృష్ణుడును అర్జునుడును తెల్ల గుఱ్ఱములను బూన్చిన గొప్ప రథమునందున్నవారలై దివ్యములగు తమ శంఖములను పూరించిరి.

అవతారిక. ఆ పూరించిన క్రమము విభజించి చెప్పుచున్నారు.

పాంచజన్యం హృషీకేశో దేవదత్తం ధనంజయః।
పౌండ్రం దధ్మౌ మహాశంఖం భీమకర్మా వృకోదరః. 15.

హృషీకేశః- హృషీక- ఇంద్రియములకు, ఈశః, నియామకుడయిన శ్రీకృష్ణుడు; పాంచజన్యం, పంచజనుడను రాక్షసునివలన బుట్టినశంఖమును; దధ్మౌ, పూరించెను; ధనంజయః, అర్జునుడు; దేవదత్తం, దేవదత్తమను శంఖమును, దధ్మౌ, పూరించెను; భీమకర్మా, భీమ, భయంకరమయిన; కర్మా, కార్యముగలిగిన; వృకోదరః, భీముడు; పౌండ్రం, పౌండ్రమనెడి; మహాశంఖం, గొప్పశంఖమును; దధ్మౌ, పూరించెను.

కృష్ణుడు పాంచజన్యమను శంఖమును, అర్జునుడు దేవదత్త

మను పేరుగల శంఖమును పూరించిరి. భయంకరమైన పరాక్రమముగల భీముడు పౌండ్రమను పేరుగల గొప్ప శంఖమును పూరించెను.

అనంతవిజయం రాజా కుంతీపుత్రో యుధిష్ఠిరః।
నకులస్సహదేవశ్చ సుఘోషమణిపుష్పకౌ॥ 16.

కుంతీపుత్రః, కుంతీదేవికి పుత్రుడయిన; యుధిష్ఠిరః, యుధిష్ఠిరుండను పేరుగల; రాజా, ధర్మరాజు; అనంతవిజయమ్, అనంతవిజయమనెడి శంఖమును; దధ్మౌ-పూరించెను; నకులః, నకులుడును; సహదేవశ్చ, సహదేవుడును, సుఘోషమణిపుష్పకౌ, సుఘోష మణిపుష్పకములను శంఖములను; ప్రదధ్మతుః, క్రమముగా పూరించిరి; ఇదియునుం గాక.

అంతట రాజైన కుంతీపుత్రుడు ధర్మరాజు అనంత విజయమను పేరుగల శంఖమును పూరించెను. నకులుడును సుఘోషమను శంఖమును పూరించెను. సహదేవుడును మణిపుష్పకమను శంఖమును పూరించెను.

కాశ్యశ్చ పరమేష్వాసః శిఖండీచ మహారథః।
ధృష్టద్యుమ్నో విరాటశ్చ సాత్యకిశ్చాపరాజితః॥ 17.

పరమేష్వాసః- పరమ, శ్రేష్ఠమయిన; ఇష్వాసః, ధనుస్సు గల; కాశ్యశ్చ, కాశీరాజును; మహారథః, మహారథికుడైన; శి

ఖండీచ, శిఖండియు;ధృష్టద్యుమ్నశ్చ, ధృష్టద్యుమ్నుడును;విరాటశ్చ, విరాటుండును; అపరాజితః, యుద్ధమునందు జయింపబడని; సాత్యకిశ్చ,సాత్యకియును; (వీరలు వేర్వేరుగ శంఖములను పూరించిరని ఉత్తరశ్లోకముతో నన్వయము.)

గొప్ప ధనుస్సు ధరించిన కాశీరాజును మహారథుడైన శిఖండియును ధృష్టద్యుమ్నుడును విరాటరాజును పరాజయము లేనిసాత్యకియును తమతమ శంఖములను పూరించిరి.

ద్రుపదో ద్రౌపదేయాశ్చ సర్వశః పృథివీపతే।
సౌభద్రశ్చమహాబాహుశ్శంఖాన్ దధ్ముః పృథక్పృథక్. 18.

హే పృథివీపతే, ఓ ధృతరాష్ట్రుడా, ద్రుపదశ్చ, ద్రుపదరాజును;ద్రౌపదేయాశ్చ,ద్రౌపదీపుత్రులైన ప్రతివింధ్యాదులును; మహాబాహుః, మిక్కిలి బలముగల భుజములు గలిగిన; సౌభద్రశ్చ, అభిమన్యుడును, సర్వశః, ఈచెప్పబడిన యోధాగ్రేసరులందరును, శంఖాన్, శంఖములను; పృథక్పృథక్, వేర్వేరుగా; దధ్ముః, పూరించిరి.

ఓయి ధృతరాష్ట్రుడా ద్రుపదరాజును, ద్రౌపది కొడుకులును గొప్ప బాహువులుగల అభిమన్యువును వీరలందఱు వేర్వేరుగా తమతమ శంఖములను పూరించిరి.

స ఘోషో ధార్తరాష్ట్రాణాం హృదయాని వ్యదారయత్।
నభశ్చ పృథివీంచైవ తుములో వ్యనునాదయన్. 16.

తుములః, సంకులమైన; సంఘోషః, శ్రీకృష్ణార్జునాది శంఖారవము; నభశ్చ, ఆకాశంబును; పృథివీం చైవ, భూమిని; వ్యనునాదయన్, ప్రతిధ్వనులచేత నిండింపుచున్న దగుచు; ధార్తరాష్ట్రాణాం, నీసంబంధులగున దుర్యోధనాదులకు; హృదయాని, మనస్సులను; వ్యదారయత్. భేదించెను.

సంకులమైన ఆ మహాధ్వని ఆకాశమును భూమిని ప్రతి ధ్వనింపఁజేయుచు దుర్యోధనుఁడు మొదలగువారి హృదయములను భేదించెను.

అథ వ్యవస్థితాన్ దృష్ట్వా ధార్తరాష్ట్రాన్ కపిధ్వజః।
ప్రవృత్తే శస్త్రసంపాతే ధనురుద్యమ్య పాండవః।
హృషీకేశం తదా వాక్య మిదమాహ మహీపతే. 20.

హే మహీపతే! ఓయిధృతరాష్ట్రుఁడా, అథ! ఈ ఉభయసైనికులు శంఖారవముచేసిన పిమ్మట, శస్త్ర 'సంపాతే' శస్త్రి' బాణములయొక్క. సంపాతే! లెస్సగాఁబడుట, ప్రవృత్తేసతి! ప్రవర్తించుచుండగా, కపిధ్వజః! హనుమద్ధ్వజుఁడయిన, పాండవః, అర్జునుడు, వ్యవస్థితాన్! యుద్ధముచేయ నుద్యోగించియున్న! ధార్తరాష్ట్రాన్! నీ కుమారులయిన దుర్యోధనాదులను, దృ

దృష్ట్వా! చూచి, ధనుః! విల్లును, ఉద్యమ్య! ఎక్కుపెట్టి, తదా అవసరమునందు. హృషీకేశం! శ్రీకృష్ణస్వామినిగూర్చి, ఇదం ఈ, వాక్యం! వాక్యమును, ఆహ! పలికెను.

అటుపిమ్మట ఓయిరాజా ఒకరిమీదనొకరు బాణములు ప్రయోగించుట ఆరంభము కాగానే హనుమంతుడు ధ్వజమునందు గల అర్జునుడు యుద్ధమునకు సన్నద్ధులైనిలిచియున్న దుర్యోధనాదులనుచూచి విల్లెక్కు పెట్టి అప్పుడు కృష్ణునితో ఈవాక్యము చెప్పెను.

అవతారిక. అర్జునుడు పలికిన పలుకుల జెప్పుచున్నాడు.

సేనయోరుభయోర్మధ్యే రథంస్థాపయ మేఽచ్యుత।
యావదేతాన్ నిరీక్షేఽహం యోద్ధుకామా నవస్థితాన్।
కైర్మయా సహయోద్ధవ్య మస్మిన్రణ సముద్యమే. 21.

హే అచ్యుత! శ్రీకృష్ణస్వామీ, అస్మిన్! ఈ, రణసముద్యమే రణ! యుద్ధముచేయుట, సముద్యమే! ఉపక్రమమందు, కైస్సహ! ఎవరితోడ. మయా! నాచేత, యోద్ధవ్యం! యుద్ధముచేయదగినది, (తన్నిమిత్తమై) అహం! నేను, యోద్ధుకామాన్! యుద్ధముచేయ నిచ్ఛయించిన వారలయి, అవస్థితాన్! ఉన్నట్టి, ఏతాన్! ఈ, ధార్తరాష్ట్రాన్! దుర్యోధనాదులను, యావత్! ఎంతలోపల, నిరీక్షే! చూడగలనో, తావత్! అంతలోపల,

ఉభయోః, రెండైన; సేనయోః, సేనలయొక్క; మధ్యే, నడుమ; మే, నాయొక్క రథం- రథమును; స్థాపయ, ఉంచుము. అని అర్జునుడుపలికెనని యన్వయము.

అచ్యుతా! ఈయుద్ధారంభమందు నేను ఎవరితో పోరవలెనో తెలియుటకై యుద్ధముచేయ కోరి నిలిచియున్న ఈ దుర్యోధనాదులను నేను చక్కగా చూచువరకు నా రథమును రెండు సైన్యముల నడుమ నిలుపుము.

యోత్స్యమానానవేక్షేఽహం య ఏతేఽత్ర సమాగతాః।
ధార్తరాష్ట్రస్య దుర్బుద్ధే ర్యుద్ధే ప్రియచికీర్షవః. 22.

దుర్బుద్ధేః, దుష్టబుద్ధిగలిగిన; ధార్తరాష్ట్రస్య, దుర్యోధనునకు; యుద్ధే, యుద్ధమందు; ప్రియచికీర్షవః, ప్రియ, ఇష్టమును; చికీర్షవః, చేయనిశ్చయించిన; యఏతే, ఏవీరలు; అత్ర- యీ యుద్ధరంగమునకు; సమాగతాః, వచ్చిరో; అహం, నేను; యోత్స్యమానాన్, యుద్ధము చేయువారలను; ఏతాన్, వీరలను; అవేక్షే; చూచెదను కావున ఉభయసేనామధ్యమందు రథము నిలుపుమనుట.

దుర్బుద్ధియగు దుర్యోధనునకు యుద్ధమునందు ప్రియము సేయగోరిన వారలై యిచటికి వచ్చియున్న వారలును మనతో యుద్ధము సేయబోవువారలు నగు వీరలను చూచెదను.

అవతారిక. పిమ్మట నెట్టులయ్యెననగా సంజయుండు చెప్పు చున్నా

సంజయ ఉవాచ.

ఏవముక్తో హృషీకేశో గుడాకేశేన భారత।
సేనయోరుభయోర్మధ్యే స్థాపయిత్వా రథోత్తమమ్. 23.

హేభారత- ఓధృతరాష్ట్రుఁడా; గుడాకేశేన-గుడాక-నిద్రకు ఈశేన-నియామకుడైనయర్జునునిచేత; ఏవం- ఈపూర్వోక్తప్రకారముగా; ఉక్తస్సన్-పలుకబడినవాఁడై; హృషీకేశః-శ్రీకృష్ణస్వామి; ఉభయోః-రెండైన; సేనయోః-సేనలయొక్క; మధ్యే-మధ్యమందు; రథోత్తమం, రథశ్రేష్ఠమును; స్థాపయిత్వా-నిలిపి. అర్జునునిగూర్చి పలికెనని ఉత్తర శ్లోకముతో నన్వయము.

ఓ ధృతరాష్ట్రా కృష్ణుడు ఈప్రకారము అర్జునునిమాట విని ఆయుత్తమమైన రథమును రెండుసైన్యముల నడుమనిలిపి.

భీష్మ ద్రోణ ప్రముఖత స్సర్వేషాంచ మహీక్షితామ్।
ఉవాచపార్థపశ్యైతాన్ సమవేతాన్కురూనితి. 24.

భీష్మద్రోణ ప్రముఖతః, భీష్మ, భీష్మునియొక్కయు; ద్రోణ, ద్రోణాచార్యునియొక్కయు;ప్రముఖతః,ఎదుటనున్న;సర్వేషాం;

క్షను_క్షమైన, మహీక్షితాం-రాజుల యొక్క, పురతః-యెదుట
నురథమునిలిపి. (అని పూర్వశ్లోకముతో నన్వయము.) హే
పార్థ- ఓయిఅర్జునుడా,సమవేతాన్- యుద్ధార్థమైకూడియున్న,
ఏతాన్-యీ,కురూన్-కౌరవసైనికులను,పశ్య-చూడుమని;
ఉవాచ- అర్జుననునిగూర్చి పలికెను.

భీష్మ ద్రోణులును సమస్త రాజులును చూచుచుండగా
అర్జునా! యుద్ధము నిమిత్తమై చేరియున్న ఈ కౌరవులను
జూడుము. అని యర్జునునితో బలికెను.

తత్రాపశ్యత్ స్థితాన్ పార్థః పితౄనథ పితామహాన్।
ఆచార్యాన్మాతులాన్భ్రాతౄన్ పుత్రాన్పౌత్రాన్సఖీంస్తథా।
శ్వశురాన్సుహృదశ్చైవ సేనయోరుభయోరపి. 26.

అథ, శ్రీకృష్ణవాక్యశ్రవణానంతరమందు;పార్థః,అర్జునుడును;
తత్ర,ఆకురుసేనయందు; స్థితాన్,ఉన్నట్టి;పితౄన్,పినతండ్రులు
పెదతండ్రులయిన భూరిశ్రవఃప్రభృతులను; పితామహాన్, తాత
లయిన భీష్మాదులను; ఆచార్యాన్, గురువులయిన ద్రోణాదుల
ను; మాతులాన్, మేనమామలయిన శల్యాదులను; భ్రాతౄన్,
అన్నదమ్ములయిన దుర్యోధనాదులను; పుత్రాన్,వారికుమారు
లయిన లక్ష్మణాదులను; పౌత్రాన్, వారికొడుకులయిన మను
లనుమ; సఖీన్,మిత్రులయిన కృతవర్మాదులను; శ్వశురాన్, బి

డ్డలనిచ్చినమామలను; సుహృదః, ఉపకారముచేసిన వారిలను; అపశ్యత్, చూచెను. అపిచ, కౌరవసేనలయందు నిట్టివారలఁ జూచుటయేకాను. మఱియేమనిన ఉభయోః, రెండైన; సేనయోః, సేనలయందు; ఇట్టి వారలంజూచెనని యూహింపవలయు.

అర్జునుఁడు ఆ రెండు సేనలయందును ఉన్నవారలను తండ్రులను తాతలను ఆచార్యులను మేనమామలను సహోదరులను కొడుకులను మనుమలను మిత్రులను మామలను ఉపకారము చేసినవారలను జూచెను.

తాన్ సమీక్ష్య స కౌంతేయ స్సర్వాన్ బంధూనవస్థితాన్।
కృపయా పరయావిష్టో విషీదన్నిదమబ్రవీత్. 26.

సః కౌంతేయః, ఆ అర్జునుఁడు; అవస్థితాన్, యుద్ధరంగమందున్న; తాన్, పూర్వోక్తులయిన; సర్వాన్, సమస్తమైన; బంధూన్, చుట్టములను; సమీక్ష్య, చూచి; పరయా, ఉత్కృష్టమైన; కృపయా, దయతోడ; ఆవిష్టః, కూడినవాడయి; విషీదన్, దుఃఖించుచున్నవాడయి, ఇదం, ఈవక్ష్యమాణ వాక్యమును; అబ్రవీత్, పలికెను.

ఆ అర్జునుడు ఆ రెండుసేనలయందున్న బంధువుల నందరిని జూచి అధికమయిన దయతో కూడినవాడై దుఃఖితుడై ఈ వాక్యమును పలికెను;

అర్జున ఉవాచ.

దృష్ట్వేమం స్వజనంకృష్ణ యుయుత్సుం సముపస్థితమ్।
సీదంతి మమగాత్రాణి ముఖంచ పరిశుష్యతి।
వేపథుశ్చ శరీరేమే రోమహర్షశ్చజాయతే. 27.

హేకృష్ణ,ఓకృష్ణస్వామిా; యుయుత్సుమ్, యుద్ధముజేయని చ్ఛించిన; సముపస్థితం, సమీాపమును బొందియున్న; ఇమం స్వజనం,యీబంధుజనమును; దృష్ట్వా, చూచి; మమ, నాయొక్క; గాత్రాణి, అవయవములు; సీదంతి,శిథిలములగుచున్నవి. మే,నాయొక్క; ముఖం, నోరు; పరిశుష్యతి, ఎండుచున్నది; శరీరే, దేహమందు; వేపథుశ్చ,వణుకును; రోమహర్షశ్చ, రోమ- వెంట్రుకలయొక్క; హర్షశ్చ- గగుర్పాటును; జాయతే- పుట్టు చున్నది.

ఓ కృష్ణా! యుద్ధముచేయఁగోరి యెదుట నిలిచియున్న ఈ బంధువులను జూడగా నా అవయవములన్నియు పరవశములగు చున్నవి. నోరు ఎండుచున్నది. నా దేహమునందు వణకుకలిగెను. వెంట్రుకలకు గగుర్పాటుకలిగెను.

గాండీవంస్రంసతేహస్తాత్ త్వక్చైవ పరిదహ్యతే
నచశక్నోమ్యవస్థాతుం భ్రమతీవచమేమనః. 28.

మే- నాయొక్క; గాండీవం- గాండీవమనెడివిల్లు; హస్తాత్-

హస్తమునుండి; స్రంసతే-జారుచున్నది; త్వక్చైవ-చర్మమును; పరిదహ్యతే- అంతటఁదహింపఁబడుచున్నది; మే-నాయొక్క; మనశ్చ-మనస్సును; భ్రమతీవ- చంచలమయినదానివలెనున్నది కావున; అవస్థాతుం- రథముమీఁద నుండుటకు; నశక్నోమి- సమర్థుఁడనుకాను.

గాండీవము చేతనుండి జారిపడుచున్నది. నా చర్మమంతయు మిక్కిలి తపించుచున్నది. నిలువఁజాలక యున్నాను. నామనస్సు తిరుగుబడుచున్నది.

నిమిత్తానిచ పశ్యామి విపరీతాని కేశవ।
నచశ్రేయో నుపశ్యామి హత్వా స్వజన మాహవే. 29॰

హే కేశవ- ఓకృష్ణస్వామీ; విపరీతాని- అనర్థసూచకములయిన; నిమిత్తానిచ- శకునములను; పశ్యామి- చూచుచున్నాను; ఆహవే-ఆయుద్ధమందు; స్వజనం-బంధుజనమును; హత్వా- చంపి; అను- ఆపిమ్మట; శ్రేయశ్చ- శుభమును; నపశ్యామి- చూడను.

కృష్ణా! ఇదిగాక అశుభసూచకములయిన శకునములు కనబడుచున్నవి. యుద్ధమునందు బంధుజనమును చంపినను అందువల్ల శుభమేమియు కనబడదు.

నకాంక్షే విజయం కృష్ణ నచ రాజ్యం సుఖానిచ।
కిన్నో రాజ్యేన గోవింద కింభోగైర్జీవితేనవా. 30.

హేకృష్ణ-ఓకృష్ణస్వామీ; అహం-నేను; విజయం-గెలుపు
ను; నకాంక్షే- కోరను; రాజ్యంచ-రాజ్యంబును; సుఖానిచ- సు
ఖంబులను; నకాంక్షే- కోరను; హేగోవింద- ఓకృష్ణస్వామీ;
రాజ్యేన-రాజ్యముచేత; నః-మనకు; కిం-ఏమి? భోగైః- సుఖము
లచేత; కిం-ఏమి? జీవితేనవా-బ్రతుకుటచేతనైన; కిం-ఏమి?

కృష్ణా! నాకు జయమువలదు, రాజ్యమువలదు, సుఖమువల
దు. గోవిందా! మనకు ఈ రాజ్యముచేత లాభమేమియు లేదు.
ఈ భోగములచేతను ఏమియు లాభము లేదు. ఇట్టిబ్రతుకుచేత
ను లాభమేమియు లేదు.

యేషా మర్థేకాంక్షితంనో రాజ్యం భోగా స్సుఖానిచ।
తఇమేఽవస్థితాయుద్ధే ప్రాణాం స్త్యక్త్వాధనానిచ. 31.

యేషాం-ఏద్రోణాచార్యులు మొదలయినవారియొక్క; అర్థే-
ప్రయోజనమంను; నః-మనయొక్క; రాజ్యం-రాజ్యము; కాంక్షి
తం-కోరబడెనో; భోగాశ్చ-స్త్రీచందనవస్త్రాదిభోగములును;
సుఖానిచ- సుఖములును; కాంక్షితాని- కోరబడినవో; తే- ఆ;
ఇమే- ఈ ద్రోణాచార్యులు మొదలయినవారు; ప్రాణాంశ్చ-ప్రా
ణములను; ధనానిచ-ధనములను; త్యక్త్వా-విడిచి; యుద్ధే-యు

ద్ధమందు; అవస్థితాః-ఉన్నవారైరి.

ఆచార్యాః పితరః పుత్రా స్తథైవచ పితామహాః।

మాతులా శ్శ్వశురాః పౌత్రా శ్శ్యాలా స్సంబంధిన స్తథా.

ఆచార్యాః-ఆచార్యులును; పితరః-తండ్రులును; పుత్రాః-కొమాళ్లును; తథైవచ-అట్లప్రకారమే; పితామహాః- తాతలును మాతులాః-మేనమామలును; శ్వశురాః- పడుచునిచ్చినమామలును; పౌత్రాః-మనుమలును, శ్యాలాః- పెండ్లాముతోడబుట్టినవారును; సంబంధినః సంబంధులును,

ఎవరినిమిత్తమై మనము రాజ్యమును, భోగములను సుఖములను కోరుదుమో అట్టి ఆచార్యులును, తండ్రులును, కొడులును, తాతలును, మేనమామలును, మామలును, మనుమలును, మఱఁదులును, ప్రాణములను ధనములను వదలి యుద్ధముకొఱకు నిలిచియున్నారు.

ఏతా న్నహంతు మిచ్ఛామి ఘ్నతోపి మధుసూదన।

అపి త్రైలోక్య రాజ్యస్య హేతోః కిన్ను మహీకృతే. 33.

హేమధుసూదన-ఓకృష్ణస్వామీ; ఘ్నతోపి- మమ్ము సంహరించుచున్న వారలయినను; ఏతాన్- ఈ దుర్యోధనాదులను; త్రైలోక్యరాజ్యస్య- ముల్లోకపురాజ్యము యొక్క; హేతోరపి- కారణమువలన నయినను; హంతుం- సంహరించుటకొఱకు; నే

చ్ఛామి-కోరను; మహీకృతే- మహీ-భూమియొక్క; కృతే-పొ
త్తికొఱకు; కిన్ను-ఏమి? అనగా దుర్యోధనాదులసంహరించుటవ
లన త్రైలోక్యప్రాప్తి గలిగినను నిష్కారణముగా వారు మమ్ము
జంపవచ్చినను వారలనేను జంపగోరననుట. ఇదియునుంగాక,

ఓ కృష్ణా వీరలు నన్ను హింసించుచున్నను, త్రైలోక్యరా
జ్యము లభించినప్పటికిని వీరల హింసింపనొల్లను. ఇక యీ
భూరాజ్యము కొఱకు హింసింపనొల్లనని చెప్పవలయునా?

నిహత్య ధార్తరాష్ట్రాన్నః కాప్రీతిస్స్యాజ్జనార్దన।
పాపమేవాశ్రయేదస్మాన్హత్వైతానాతతాయినః॥ 34

హే జనార్దన- ఓ శ్రీకృష్ణస్వామీ; ధార్తరాష్ట్రాన్- దు
ర్యోధనాదులను; నిహత్య-చంపి; నః-మనకు; కా ప్రీతిః-ఏమిసం
తోషము; స్యాత్-కలుగును. ఆతతాయినః॥ శ్లో॥ అగ్నిదో గ
రదశ్చైవ క్షేత్రదారాపహారకః। శస్త్రపాణిర్ధనహారః షట్
తే హ్యాతతాయినః॥ చిచ్చుపెట్టిన వాడును, విషముపెట్టిన
వాడును, భూమి నపహరించిన వాడును, భార్య నపహరించి
నవాడును, ఆయుధహస్తుడై నఱుకవచ్చినవాడును, ద్రవ్యము
నపహరించిన వాడును వీరలార్గురును ఆతతాయులని యా
పస్తంబులు చెప్పియున్నారు. గనుక ఇట్టి మహాపాతకులై
నప్పటికిని; ఏతాన్- ఈదుర్యోధనాదులను; హత్వా-చంపి; అ

స్యాత్- మమ్మును; పాపమేవ- దోషమే; ఆశ్రయేత్ - పొందును. కావున.

కృష్ణా దుర్యోధనాదులను చంపుటచే మనకుఏమిసంతోష ముకలుగును? వీరలు మనల హింసింపవచ్చియున్నను వీరలను చంపుటచే మనకు పాపమేకల్గును.

తస్మాన్నార్హావయంహంతుం ధార్తరాష్ట్రాన్సబాంధవాన్,
స్వజనం హి కథం హత్వా సుఖినస్స్యామమాధవ. 35.

హేమాధవ- ఓ శ్రీకృష్ణస్వామీ; స్వజనం- బంధుజనమును; హత్వా-చంపి; కథం-ఏప్రకారము; సుఖినః-సుఖముగలవారము; స్యామ-అగుదుము? తస్మాత్-ఆకారణమువలన; వయం-మనము; సబాంధవాన్-బంధుసహితులయిన; ధార్తరాష్ట్రాన్-దుర్యోధనాదులను; హంతుం-చంపుటకొరకు; నార్హాః-అర్హులము కాము.

కాబట్టి దుర్యోధనాదులను వారిబంధువులను వధించుటమనకుచితముకాదు. కృష్ణా! మనబంధువులను మనమేవధించియెట్లుసుఖము పొందుదుము.

యద్యప్యేతేన పశ్యంతి లోభోపహతచేతసః
కులక్షయకృతం దోషం మిత్రద్రోహేచ పాతకమ్. 36.

యద్యపి- ఏలాగునయినను; లోభోపహతచేతసః- లోభ-

రాజ్యలోభముచేత; ఉపహత-కొట్టబడిన; చేతసః- మనస్సులుగల; ఏతే-ఈదుర్యోధనాదులు; కులక్షయకృతం-కులక్షయ-వంశక్షయముచేత; కృతం! చేయబడిన, దోషంచ! దోషమును, మిత్రద్రోహే! మిత్రద్రోహమందలి, పాతకంచ! పాతకమును, నపశ్యంతి, చూడరు.

ఈ దుర్యోధనాదులు లోభమునకు లోబడిన మనస్సుగలవారగుటచే వంశనాశముచేగలుగు దోషమును మిత్ర ద్రోహముచేగలుగు పాపమును చూడకున్నారు సరేకాని

కథంనజ్ఞేయమస్మాభిః పాపాదస్మాన్నివర్తితుమ్।
కులక్షయ కృతందోషం ప్రపశ్యద్భిర్జనార్దన. 37.

హే జనార్దన, ఓ శ్రీకృష్ణస్వామీ; కులక్షయకృతం, కులనాశముచేచేయబడిన; దోషం,దోషమును;ప్రపశ్యద్భిః, చూచుచున్న; అస్మాభిః,మనచేత; అస్మాత్ పాపాత్, యీ పాపమువలన నివర్తితుం, నివర్తించుకొనుటకు; కథం, ఎట్లు; నజ్ఞేయం, తెలియదగినదికాదు?

ఓ జనార్దనుఁడా! వంశనాశముచేకలుగుదోషమును చూచుచున్నమనము ఈపాపకార్యము విడువవలెననుటను ఎట్లు తెలియకయుండవచ్చును.

కులక్షయే ప్రణశ్యంతి కులధర్మాస్సనాతనాః।
ధర్మేనష్టే కులంకృత్స్న మధర్మోభిభవత్యుత. 38.

కులక్షయే-వంశనాశము; సతి- కలుగుచుండగా; సనాతనాః- శాశ్వతములయిన; కులధర్మాః-వంశాచారములు; ప్రణశ్యంతి- నశించుచున్నవి; ధర్మే- ఆచారము; నష్టేసతి- నశించుచుండగా; కృత్స్నం- సమస్తమయిన, కులం- వంశమును; అధర్మః-అనాచారము; అభిభవత్యుత- దృఢముగాబొందుచున్నది.

వంశనాశము కలుగగానే శాశ్వతములయిన వంశాచారము లన్నియు నశించును. ఆచారములు నశించుటచే వంశమంతయు అధర్మము పాలగును.

అధర్మాభిభవాత్కృష్ణ ప్రదూషంతి కులస్త్రియః।
స్త్రీషుదుష్టాసు వార్ష్ణేయ జాయతే వర్ణసంకరః. 39.

హే కృష్ణ-ఓకృష్ణస్వామీ; అధర్మాభిభవాత్-అనాచారము గలుగుటవలన; కులస్త్రియః- కులస్త్రీలు, ప్రదూష్యంతి-చెడిపోవుచున్నారు; హే వార్ష్ణేయ- ఓ శ్రీకృష్ణస్వామీ; స్త్రీషు- స్త్రీలు; దుష్టాసుసతీషు, స్వాచార భ్రష్టలగుచునుండగా; వర్ణసంకరః- వర్ణ- బ్రాహ్మణాది జాతులయొక్క; సంకరః- చెడుటు జాయతే-కలుగుచున్నది.

కృష్ణా! వంశము అధర్మముపాలగుటచే కులస్త్రీలు చెడుదు

రు. స్త్రీలు చెడుటచే వర్ణసంకరమగును.

సంకరోనరకాయైవ కులఘ్నానాంకులస్యచ।

పతంతిపితరో హ్యేషాం లుప్తపిండోదకక్రియాః. 40.

సంకరః,వర్ణసంకరము; కులఘ్నానాం,వంశముచెఱిచిన వారలకును; కులస్య, ఆసంకీర్ణ వర్ణమునకును; నరకాయైవ, నరకముకొఱకే, భవతి,అగుచున్నది. ఏకారణమువలన. ఏషాం,ఈసంకరముగలవారియొక్క; పితరః, పితృదేవతలు; లుప్త పిండోదక క్రియాస్సంతః, లుప్త, లోపించిన; పిండోదక క్రియాస్సంతః పిండోదక కార్యములు గలవారగుచు; పతంతి, అధోలోకమున పడుచున్నారు.

వర్ణసంకరము వంశము నశింపచేసిన వారికిని ఆవంశమునకును నరకమునే కలిగించును. ఏలయనగా వీరి పితృదేవతలు పిండోదకకార్యములు లేనివారలై, అధోలోకమున బడుదురు.

దోషైరేతైః కులఘ్నానాం వర్ణసంకర కారకైః।

ఉత్సాద్యంతే జాతిధర్మాః కులధర్మాశ్చ శాశ్వతాః. 41.

ఏతైః,ఈ; వర్ణసంకరకారకైః, వర్ణ, బ్రాహ్మణాదివర్ణముల యొక్క; సంకరః, కలియుటను; కారకైః, చేయుచున్నట్టి; కులఘ్నానాం,కులమును జెఱచినవారియొక్క; దోషైః,దోషములచేత శాశ్వతాః, పరంపరాప్రాప్తములయిన; జాతిధర్మాశ్చ,వర్ణాచార

ములును; కులధర్మాశ్చ, కులాచారములును; ఉత్సాద్యంతే, పో గొట్టబడుచున్నవి.

కులమును నశింపజేయువారిచే కలుగునట్టి ఈ దోషములచే వర్ణసంకరము కలుగుటవలన శాశ్వతములగు బ్రాహ్మణాది వర్ణముల కులాచారములును గోత్రాచారములును నశించుచున్నవి.

ఉత్సన్నకులధర్మాణాం మనుష్యాణాం జనార్దన।
నరకే నియతం వాసో భవతీత్యనుశుశ్రుమః. 42.

హే జనార్దన, ఓ శ్రీకృష్ణస్వామీ; ఉత్సన్నకులధర్మాణాం, ఉత్సన్న,పోగొట్టబడిన; కులధర్మాణాం, వంశాచారము గలిగిన, మనుష్యాణాం, మనుష్యులకు; నరకే,నరకమందు; నియతం,నిత్యమును; వాసః,నివాసము; భవతి,అగుచున్నది;ఇతి,ఇట్లని; అనుశుశ్రుమః- వింటిమి.

కృష్ణా! ఇట్లు వంశాచారములను నశింపచేసిన మనుష్యులకు నియతముగా నరకమునందే వాసముకలుగునని వినుచున్నాము.

అహో బత మహత్పాపం కర్తుం వ్యవసితా వయమ్।
యద్రాజ్యసుఖలోభేన హంతుం స్వజనముద్యతాః. 43.

యత్,ఏకారణమువలన; వయం,మనము; రాజ్యసుఖలోభేన, రాజ్య,రాజ్యముయొక్కయు, సుఖ, సుఖముయొక్కయు; లోభేన,లోభముచేత; స్వజనం,బంధుజనమును; హంతుం,సంహరిం

చుటకొరకు; ఉద్యతాః,యత్న ముచేసితిమో; తత్ ,ఆకారణము వలన; మహత్, అధికమైన; పాపం,పాపమును కర్తుం,చేయుట కొఱకు; వ్యవస్థితాః. ఉద్యుక్తులమైతిమి; అహో, ఆశ్చర్యము; బత, కటకట.

కాబట్టి, అయ్యో ఆశ్చర్యము. మనము ఇప్పుడు మహాపాపము సేయఁ బూనితిమి ఏలయనగా రాజ్యసుఖము నందలి యాశచే మన బంధువులనే చంపుకొనుటకు ఉద్య మించితిమి.

యది మామప్రతీకార మశస్త్రం శస్త్రపాణయః।
ధార్తరాష్ట్రా రణే హన్యు స్తన్మే క్షేమతరం భవేత్. 44.

శస్త్రపాణయః, ఆయుధహస్తులగున; ధార్తరాష్ట్రాః, దుర్యోధనాదులు; అశస్త్రం,శస్త్రవర్జితుండయ్యును;అప్రతీకారం ప్రతిక్రియ లేనట్టి; మాం,నన్ను; రణే,యుద్ధమందు; హన్యుః యది- సంహరించిరేనీ, తత్, ఆమరణము మే, నాకు, క్షేమతరం.మిక్కిలిమేలు భవేత్, అగును.

ఆయుధము లేనివాఁడను, బదులుకొట్టనివాఁడను అగు నన్ను దుర్యోధనాదులుఆయుధహస్తులై వచ్చి యుద్ధమునందు వధింతు రేని నాకదిమిక్కిలి క్షేమముగానుండును.

సంజయ ఉవాచ.

ఏవముక్త్వా ఽర్జునస్సంఖ్యే రథోపస్థ ఉపావిశత్।
విసృజ్య సశరంచాపం శోకసంవిగ్న మానసః. 45.

అర్జునః! అర్జునుడు, ఏవం! ఈపూర్వోక్తప్రకారముగా, ఉక్త్వా! పలికి, శోక సంవిగ్నమానసః! శోక! దుఃఖముచేత, సంవిగ్న! చలించిన, మానసః! మనస్సుగల వాడగుచు, సశరం! బాణముతో గూడిన, చాపం! వింటిని, విసృజ్య! విడిచి, సంఖ్యే! యుద్ధమందు, రథోపస్థే! రథముమీద, ఉపావిశత్, కూర్చుండెను.

ఇట్లు చెప్పి అర్జునుడు దుఃఖముచే పరవశమైన మనస్సుగల వాడై బాణమును ధనుస్సును విడిచి యుద్ధమునందు రథముమీద ఊరక కూర్చుండెను.

ఇతి శ్రీ భగవద్గీతానూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం,
యోగశాస్త్రే, శ్రీ కృష్ణార్జున సంవాదే,
అర్జున విషాద యోగో నామ
ప్రథమో ధ్యాయః.

---

ఓం తత్సదితి శ్రీ పరమహంస పరివ్రాడకాచార్య
బ్రహ్మానంద సరస్వతీ శిష్య రామచంద్రానంద
సరస్వతీ విరచితాయాం, భగవద్గీతా వ్యా
ఖ్యాయాం పదయోజనీసమాఖ్యాయాం
అర్జున విషాద యోగో నామ
ప్రథమోధ్యాయః,

ఉపనిష ద్రూపములును, బ్రహ్మవిద్యయును, యోగ
శాస్త్రమును, శ్రీ కృష్ణార్జునుల సంవాద రూ
పంబయిన శ్రీ భగవద్గీతలయందు అర్జు
న విషాద యోగ మనెడి
ప్రథమాధ్యాయము.
ముగిసినది.

---

# శ్రీరస్తు.

# శ్రీకృష్ణాయనమః.

# శ్రీ భగవద్గీత.

## సాంఖ్యయోగోనామ ద్వితీయోఽధ్యాయః.

---

### సంజయ ఉవాచ.

తం తథా కృపయాఽఽవిష్ట మశ్రుపూర్ణా కులేక్షణమ్।
విషీదంత మిదం వాక్య మువాచ మధుసూదనః॥ 1

కృపయా- దయతోడ; ఆవిష్టం- కూడుకొనియున్న; అశ్రుపూర్ణాకులేక్షణం- అశ్రు- కన్నీటిచేత; పూర్ణ-నిండిన; ఆకుల- వ్యాకులమైన; ఈక్షణం- కన్నులుగలవాడును; తథా- ఆ ప్రకారముగా; విషీదంతం- దుఃఖించుచున్న; తం- ఆ యర్జునుని గూర్చి; మధుసూదనః- శ్రీకృష్ణస్వామి; ఇదం- ఈ చెప్పబోవుది; వాక్యం- వచనమును; ఉవాచ- పలికెను.

సంజయుఁడు పలికెను. అట్లు దయచే నావేశింపఁ బడిన వాఁడై కన్నీళ్లచేకలఁగిన కన్నులుగలవాఁడై దుఃఖించుచున్న ఆ యర్జునునిఁ జూచి మధువును సంహరించిన శ్రీకృష్ణుఁడు ఈ వాక్యమును బలికెను

## శ్రీ భగవానువాచ.

కుతస్త్వా కశ్మలమిదం విషమే సముపస్థితమ్।
అనార్యజుష్టమస్వర్గ్యమకీర్తికరమర్జున. 2.

హే అర్జునా— ఓ యర్జునుడా; కుతః— ఏ హేతువువలన; విషమే— సంకటకాలమందు; అనార్యజుష్టం, అనార్య— పామరుల చేత, జుష్టం— సేవింపబడినదియు; అస్వర్గ్యం— స్వర్గమునకననర్హమైనదియు; అకీర్తికరంచ— అపకీర్తికరమైన; ఇదం— ఈ; కశ్మలం— మోహము; త్వాం— నిన్ను; సముపస్థితం— పొందెను.

అర్జునా! పామరులకు తగినదియు, నరకముగలిగించునదియు, అపకీర్తి యిచ్చునదియు నగు ఈ మోహము నీకు ఈసంకటకాలమునందు ఎట్లు గలిగెను.

క్లైబ్యం మాస్మగమః పార్థ నైతత్త్వయ్యుపపద్యతే।
క్షుద్రం హృదయదౌర్బల్యం త్యక్త్వోత్తిష్ఠ పరంతప. 3.

హేపార్థ— ఓయి అర్జునుడా; క్లైబ్యం— భయమును; మాస్మగమః— పొందకుము; త్వయి— నీయందు; ఏతత్— ఈకార్యము. నోపపద్యతే— పొందదగినదికాదు; హే పరంతప— ఓయి యర్జునుడా; క్షుద్రం— తుచ్ఛమయిన; హృదయదౌర్బల్యం, హృదయ—మనస్సునందలి, దౌర్బల్యం— అధైర్యమును; త్యక్త్వా— వి

డిచి; ఉత్తిష్ఠ-యుద్ధమునకు లెమ్ము.

పార్థా! పిఱికితనము పొందకుము. నీ వంటివానికిదియుచిత
ముకాదు. శత్రువులను తపింపజేయు వాడా! ఈ తుచ్ఛమైన
మనస్సునందలి అస్థైర్యమును విడిచి యుద్ధమునకు లెమ్ము.

అర్జున ఉవాచ.

కథం భీష్మ మహం సంఖ్యే ద్రోణంచ మధుసూదన।
ఇషుభిః ప్రతియోత్స్యామి పూజార్హా వరిసూదన. 4.

అరిసూదన- శత్రుసంహారకుడయిన, హే మధుసూదన-
ఓ కృష్ణస్వామీ; పూజార్హౌ- పూజాయోగ్యులయిన; భీష్మం-
భీష్మాచార్యునిగూర్చి; ద్రోణంచ- ద్రోణాచార్యునిగూర్చి; సం
ఖ్యే-యుద్ధమందు; అహం- నేను; ఇషుభిః- బాణములచేత; క
థం-యెట్లు; ప్రతియోత్స్యామి-ఎదిరించి యుద్ధముచేయుదును.

అందుకు అర్జునుడు పలికెను. శత్రువులను వధించునట్టి
ఓకృష్ణా! పూజింపదగినట్టి భీష్మునిమీఁదను ద్రోణాచార్యుల
మీఁదను నేనెట్లు యుద్ధమునందు ఎదిరించి బాణములను ప్ర
యోగింతును.

గురూ నహత్వాహి మహానుభావాన్ శ్రేయోభోక్తుం
భైక్ష్య మపీహ లోకే । హత్వార్థ కామాం స్తు గురూ
నిహైవ భుంజీయ భోగాన్ రుధిరప్రదిగ్ధాన్. 5.

మహానుభావాన్ - మహానుభావులయిన; గురూన్ - ద్రోణాది గురువులను; అహత్వా - సంహరించక; ఇహలోకే - ఈలోకమందు; భైక్ష్యమపి - భిక్షాన్నమునయినను; భోక్తుం - భుజించుటకు, శ్రేయః - శ్రేష్ఠము; అర్థకామాన్ - ద్రవ్యకాములయిన; గురూన్ - ద్రోణాదులను; హత్వాతు - సంహరించియో; ఇహైవ - ఈలోకమునందే; రుధిరప్రదిగ్ధాన్ - రుధిరం - నెత్తురుచేతను; ప్రదిగ్ధాన్ - పూయబడిన; భోగాన్ - భోగములను; భుంజీయ - అనుభవించెదను.

మహానుభావులయిన గురువులను వధింపక ఈ లోకమునందు భిక్షమెత్తి జీవించుటయు మేలు కదా? అర్థకాములయిన గురువులను వధించినయెడ ఈ లోకమునందే నేను వారి నెత్తుటిచే తడిసిన భోగములనేకదా యనుభవింపవలెను. (ఇక పరలోకమునందు జెప్పనేల.)

నచైత ద్విద్మః కతర న్నోగరీయో యద్వా జయేమ-
యదివా నో జయేయుః । యానేవ హత్వా నజిజీవి
షామ స్తేవస్థితాః ప్రముఖే ధార్తరాష్ట్రాః. 6.

కించ - ఇంకియు కాదు; వయం - మనము; జయేమయద్వా - దుర్యోధనాదుల జయింపఁగలమో లేదా; ధార్తరాష్ట్రాః - దుర్యోధనాదులు; నః - మనలను; జయేయుర్యది - జయింతురో

యద్వా; యేతి నో- ఈ రెంటిలోపల; నః-మనకు; కతరత్-ఏద్ది; గరీయః- గురుతరమైనది; ఏతత్ - ఈ జయాపజయములలో నేదియో యును; నవిద్మః-ఎరుంగము; యాన్- ఏ ధార్తరాష్ట్రాదులను; హత్వా- సంహరించి; నజిజీవిషామః- జీవించ నిచ్ఛింపమో; తే-వారలు; ప్రముఖే- అభిముఖమందు; అవస్థితాః-ఉన్నారు.

ఇది గాక మనమే వారిని జయింపవలెనో లేక వారే మమ్ములను జయింప వలెనో ఈ రెంటిలో మనకు ఏది గొప్పదో నాకు తెలియలేదు. ఏలయనఁగా ఎవరిని వధించిన యెడ మనము వెనుక బ్రతుకఁగోరమో అట్టి ప్రియబంధువులయిన దుర్యోధనాదులు మన యెదుట నిలిచి యున్నవారు.

కార్పణ్యదోషోపహత స్వభావః పృచ్ఛామి త్వాం
ధర్మసమ్మూఢ చేతాః । యచ్ఛ్రేయస్స్యాన్నిశ్చితం
బ్రూహి తన్మే శిష్యస్తేఽహం శాధిమాం త్వాం ప్రపన్నం. 7.

కార్పణ్య దోషోపహత స్వభావః, కార్పణ్య-కృపణత్వమనెడి, దోష-పాపముచేత, ఉపహత-తిరస్కరింపబడిన, స్వభావః-శౌర్య లక్షణము గలిగిన; అహం-నేను; ధర్మసమ్మూఢచేతాస్సన్, ధర్మ-న్యాయముమందు, సంమూఢ-జ్ఞానము లేనట్టి, చేతాస్సన్- మనస్సు గలిగినవాడనగుచు; త్వాం-నిన్ను; పృచ్ఛామి- అడుగుచున్నాను; మే-నాకు; యత్-ఏది; నిశ్చితం-నిశ్చయిం

పబడిన; శ్రేయః-శ్రేయస్సు; స్యాత్ - అగునో; తత్-దానిని; బ్రూహి-చెప్పుము; మే-నీకు; అహం-నేను; శిష్యః-శిష్యుఁడను; త్వాం-నిన్ను; ప్రపన్నం-శరణుబొందిన; మాం-నన్ను; శాధి-శిక్షింపుము.

ఈ కార్పణ్య దోషముచేత నా శౌర్యస్వభావము మాఱినది. ధర్మమేదో నా మనస్సునకు తెలియకున్నది. కావున నిన్నడుగుచున్నాను. ఏది శ్రేయస్సో దాని నాకు నిశ్చయించి చెప్పుము. నేను నీశిష్యుఁడను, నిన్ను శరణుబొందితిని. నన్ను శిక్షింపుము.

నహిప్రపశ్యామి మమాప నుద్యా ద్యచ్ఛోక ముచ్ఛో
షణ మింద్రియాణాం । అవాప్యభూమా వసపత్నమృ
ద్ధం రాజ్యం సురాణా మపిచాధి పత్యమ్. ౮.

యత్-ఏకార్యము; ఇంద్రియాణాం- ఇంద్రియములకు; ఉచ్ఛోషణం- అత్యంత శోషకరమయిన; మమ- నాయొక్క; శోకం-దుఃఖమును; అపనుద్యాత్ - పోగొట్టునో; తత్ - ఆకార్యమును, అహం-నేను: భూమౌ- భూమియందు; అసపత్నం-నిష్కంటకమైన; ఋద్ధం-సమృద్ధమైన; రాజ్యం-రాజ్యమును;సురాణాం-దేవతలయొక్క; ఆధిపత్యం- ఇంద్రత్వమును; అవాప్యాపి-పొందియును; నప్రపశ్యామిహి- కాననుగదా

ఈ భూమియందు నిష్కంటకమై సర్వసంపదలతో కూడిన రాజ్యమును పొందినను లేక దేవేంద్రత్వమును పొందినను నా ఇంద్రియములనన్నిటిని తపింపజేయుచున్న ఈ నా దుఃఖమును ఏది పోగొట్టునో అది సిద్ధించునని నాకు తోచలేదు.

అవతారిక. సంజయుడు చెప్పుచున్నాడు.

సంజయ ఉవాచ.

ఏవముక్త్వా హృషీకేశం గుడాకేశః పరంతపః।
న యోత్స్య ఇతి గోవింద ముక్త్వా తూష్ణీం బభూవహ. 9.

పరంతపః- శత్రుసంహారకుడైన; గుడాకేశః- అర్జునుడు; హృషీకేశం-శ్రీకృష్ణస్వామినిగూర్చి; ఏవం-పూర్వోక్తప్రకారముగా; ఉక్త్వా-పలికి; మరల, గోవిందంప్రతి-శ్రీకృష్ణస్వామినిగూర్చి; నయోత్స్యే-యుద్ధముచేయను; ఇతి-ఇట్లని: ఉక్త్వా పలికి; తూష్ణీం బభూవ- ఊరకుండెను.

ఇట్లు శత్రువుల తపింపచేయునట్టి అర్జునుడు కృష్ణునితో జెప్పి యుద్ధము సేయనని పలికి అంతట ఊరకయుండెను.

తమువాచ హృషీకేశః ప్రహసన్నివ భారత।
సేనయో రుభయోర్మధ్యే విషీదంతమిదం వచః. 10.

హేభారత- ఓధృతరాష్ట్రుడా; ఉభయోః- రెండైన; సేనయోః-సేనలయొక్క; మధ్యే-మధ్యమందు; విషీదంతం-దుఃఖిం

దుచున్న; తం- ఆయర్జునునిగూర్చి; హృషీకేశః- శ్రీకృష్ణస్వామి; ప్రహసన్నివ- పరిహాసము చేయువానివలె; ఇదం-ఈ చెప్పబోవుచుండి, వచః-వాక్యమును; ఉవాచ-పలికెను.

అంత శ్రీకృష్ణుఁడు అట్లు రెండుసేనలనడుమ దుఃఖించుచున్న అర్జునునిజూచి కొంచెము నవ్వుచు ఈవాక్యము పలికెను.

శ్రీ భగవాన్ ఉవాచ.

అశోచ్యా నన్వశోచ స్త్వం ప్రజ్ఞావాదాంశ్చ భాషసే।
గతాసూ నగతాసూంశ్చ నానుశోచంతి పండితాః. 11.

త్వం-నీవు; అశోచ్యాన్-దుఃఖింపఁగని భీష్మాదులఁ గూర్చి; అన్వశోచః- దుఃఖించితివి; ప్రజ్ఞావాదాంశ్చ- పండితవచనములను; భాషసే- పలుకుచున్నావు; పండితాః- ఆత్మానాత్మవివేకజ్ఞులు; గతాసూన్- చచ్చినవారిని గూర్చి; అగతాసూంశ్చ- బ్రతికినవారలను గూర్చి; నానుశోచంతి- దుఃఖింపరు.

నీవుఎవరిని గుఱించి దుఃఖింపరాదో అటువంటి భీష్మాదులను గుఱించి దుఃఖించుచున్నావు. ఇదిగాక పండితులుచెప్పుమాటలునుం జెప్పుచున్నావు. ఇది పరస్పరము విరుద్ధముగా నున్నది. ఏలయనఁగా పండితులు ప్రాణములతో నున్నవారిని గూర్చి దుఃఖింపరు సరేకదా, ప్రాణములు పోయినవారిని గూర్చికూడ దుఃఖింపరు.

న త్వేవాహం జాతునాసం నత్వం నేమే జనాధిపాః।
నచైవ నభ విష్యామ స్సర్వే వయ మతః పరమ్. 12.

అహం- సర్వేశ్వరుఁడైన నేను; జాతు- ఒకానొకప్పుడును నాసమితి తున్నైవ- లేకపోయినవాఁడను గాను, (ఎల్లప్పుడు అవినాశినై యున్నాను.) త్వంచ- నీవును; నాసీరితిన- లేకపోయినవాఁడవు కావు; ఇమే జనాధిపాః- ఈ రాజులును; నాసన్నితిన- లేకపోయినవారు కారు; వయంసర్వే- మనమందరమును; అతః- ఈ దేహనాశముకంటే; పరం- పిమ్మట; నభవిష్యామఇతిన- లేక పోగలవారము కాము. (ఈ దేహమునశించినను ఆత్మస్వరూపము చేత నిత్యులమై యున్నామని భావము.)

ఏల యనగా నేనుఇదివరకు యెప్పుడును లేని వాఁడనుకాను, నీవును యిదివరకు యెప్పుడును లేనివాఁడవు కావు, ఈ రాజులును యిదివరకు యెప్పుడును లేనివారలు కారు, అట్లే మనమందరము ఇక మీఁదను కూడా లేక పోవు వారము కాము. నేను నీవు ఈరాజులు అందరును శాశ్వతముగా నుండు వారమే కావున చావే లేనివారిని గూర్చి దుఃఖించుట యనుచితము.

దేహినోస్మిన్ యథా దేహే కౌమారం యౌవనం జరా।
తథా దేహాంతర ప్రాప్తి ర్ధీర స్తత్ర నముహ్యతి. 13.

దేహినః- దేహముగలయాత్మకు; అస్మిన్-దేహే- ఈస్థూల దేహమందు; కౌమారం-బాల్యావస్థయు; యౌవనం-మధ్యమావస్థయు; జరా-జీర్ణావస్థయు; యథా-ఏప్రకారమో; దేహాంతరప్రాప్తిః- మరియొక దేహమునుపొందుట; తథా- ఆ ప్రకారమే; (దేహమునకవస్థాభేదములును నాశములును గలుగును గాని ఆత్మకు గలుగవు) ధీరః- ప్రాజ్ఞుడు; తత్ర- ఆ దేహనాశోత్పత్తి విషయమై; నముహ్యతి- మోహమునొందడు.

జీవునకు ఈ దేహమునందు బాల్యమును, యౌవనమును, ముసలితనమును ఎట్లో మరియొక దేహమును పొందుటయు అట్లే కాబట్టి ఆ విషయమునందు పండితుడు మోహము నొందడు.

మాత్రాస్పర్శాస్తు కౌంతేయ శీతోష్ణ సుఖదుఃఖదాః।
ఆగమాపాయినో ఽనిత్యా స్తాంస్తితిక్షస్వ భారత. 14.

హే కౌంతేయ- ఓయి అర్జునుడా; మాత్రాస్పర్శాస్తు, మాత్రా- పంచ తన్మాత్రలవలన బుట్టిన శ్రోత్రాదీంద్రియముల యొక్క, స్పర్శాస్తు-శబ్దాది విషయ సంయోగములైతే; శీతోష్ణసుఖదుఃఖదా - శీతోష్ణములు మొదలైన సుఖ దుఃఖములు గలుగజేయునట్టి; ఆగమాపాయినః- సంయోగ వియోగములు గలిగినవియు; అనిత్యాః- అస్థిరములైనవియు కావున; హే

భారత– ఓయి అర్జునుడా; తాన్– ఆ శీతోష్ణాదులను; తితిక్షస్వ– ఓర్చుకొనుము. (సుఖము గలిగినప్పుడు సంతోషమును దుఃఖము గలిగినప్పుడు విషాదమును బొందకుమని భావము.)

అయితే ఓ అర్జునుడా! శ్రోత్రాదింద్రియములతో సంబంధముగల శబ్దాదివిషయములుశీతోష్ణములు మొదలగుసుఖదుఃఖములను తెచ్చునవిగా నున్నవి. అవి రాకపోకలుగలవిగావున అనిత్యములు, అర్జునా! నీవు వానిని ఓర్వవలయును.

యంహి నవ్యథయంత్యేతే పురుషంపురుషర్షభ
సమదుఃఖ సుఖంధీరం సోఽమృతత్వాయ కల్పతే 15.

హే పురుషర్షభ– ఓయి యర్జునుడా, ఏతే– ఈ మాత్రాస్పర్శములు; సమదుఃఖసుఖం, సమ- సమానములయిన, దుఃఖసుఖం–దుఃఖసుఖములుగలిగిన; ధీరం–నిశ్చలుడైన; యంహి–ఏ పురుషుని; నవ్యథయంతి– బాధింపవో; సః– ఆపురుషుడు; అమృతత్వాయ–మోక్షముకొఱకు, కల్పతే–సమర్థుడగుచున్నాడు.

ఓ పురుష శ్రేష్ఠుడా! సుఖదుఃఖములను సమానముగా నెంచుచు నిశ్చలుడైన ఏ పురుషుని ఇవి బాధింపవో అతడు మోక్షమునొందును.

నాసతో విద్యతే భావో నాభావో విద్యతే సతః।
ఉభయోరపి దృష్టోంత స్త్వనయో స్తత్వ దర్శిభిః. 16.

అసతః — నశించెడి దేహమునకు; భావః — ఉండుట; నవిద్యతే — లేదు; సతః — నిత్యుండైన యాత్మకు; అభావః — లేకపోవుట; నవిద్యతే — లేదు; తత్త్వదర్శిభిః — పరబ్రహ్మమనెడి వస్తువును దెలిసిన వారలచేత; ఉభయోః — రెండైన; అనయోః — ఈ సదసత్తులగు నాత్మదేహములయొక్క; అంతః — నిర్ణయము; దృష్టః — చూడబడెను.

అసత్తైన ఈ దేహమునకు సత్తలేదు. సత్తైన ఆత్మకు అభావము లేదు. తత్త్వము తెలిసిన పండితులు ఈ రెంటియొక్క నిశ్చయమును తెలిసియుందురు.

అవినాశి తు తద్విద్ధి యేన సర్వమిదం తతం।
వినాశ మవ్యయస్యాస్య న కశ్చిత్కర్తు మర్హతి. 17.

యేన — విష్ణ్వాఖ్యబ్రహ్మముచేత, సర్వం — సమస్తమైన; ఇదం — ఈజగత్తు; తతం — వ్యాపింపబడెనో; తత్తు — ఆ విష్ణ్వాఖ్యబ్రహ్మమును; అవినాశి — నాశములేనిదానిగా; విద్ధి — తెలియుము; కశ్చిత్ — ఒకానొకడు; అవ్యయస్య — శాశ్వతమైన; అస్య — ఈయాత్మకు; వినాశం — నాశమును; కర్తుం — చేసెడికొఱకు; నార్హతి — తగడు.

దేనిచేత ఈ సమస్తప్రపంచమును వ్యాపింపబడినదో అట్టి ఆత్మ నాశములేనిదని తెలియుము. నాశములేని ఈ ఆత్మకు నాశము గలిగించుట ఎవనికిని శక్యముగాదు.

అంతవంత ఇమే దేహా నిత్యస్యోక్తా శ్శరీరిణః
అనాశినో ప్రమేయస్య తస్మాద్యుధ్యస్వ భారత. 18.

నిత్యస్య—యెల్లప్పుడేకరూపమైనదియు; అనాశినః— నాశము లేనిదియును; అప్రమేయస్య— ప్రత్యక్షాది ప్రమాణములకగోచరమయిన; శరీరిణః—ఆత్మకు; ఇమే దేహాః— ఈశరీరములు; అంతవంతః—నాశముకలిగినవని; ఉక్తాః—తత్వజ్ఞులచేతచెప్పబడినవి; తస్మాత్—ఆకారణమువలన; హే భారత— ఓ అర్జునుడా; యుధ్యస్వ- యుద్ధముచేయుము.

ఆత్మ నాశము లేని వాడనియు ప్రత్యక్షాది ప్రమాణములచే తెలియఁదగన వాడనియు నిత్యుడనియు అతడు ధరించిన ఈ దేహములుమాత్రము, నాశము గలవనియు చెప్పబడినది కాబట్టి ఓ అర్జునుడా నీవు యుద్ధముచేయుము.

యఏనం వేత్తిహంతారం యశ్చైనం మన్యతేహతం।
ఉభౌ తౌ నవిజానీతో నాయంహంతి నహన్యతే. 19.

యః— ఏపురుషుడు; ఏనం- ఈయాత్మను; హంతారం-చంపెడివానిగా; వేత్తి- ఎరుగుచున్నాడో; యశ్చ- యెవ్వడు; ఏనం- ఈ యాత్మను; హతం- చచ్చినవానిగా; మన్యతే- తెలియుచున్నాడో; ఉభౌ- ఇద్దరైన; తౌ-ఆపురుషులు; నవిజానీతః- తెలిసినవారలుకారు; అయం-ఈయాత్మ; నహంతి- చంపదు; నహన్య

తే-చంపబడఁడు.

ఎవఁడయితే ఈ యాత్మను వధించువానిగా తలంచుచున్నాఁడో ఎవఁడు ఈ ఆత్మను వధింపబడువానిగా తెలియుచున్నాఁడో వారిద్దరును తెలియనివారలు. ఎందువల్లననగా ఈఆత్మ వధించువాఁడును గాఁడు వధింపబడువాఁడును కాఁడు.

నజాయతే మ్రియతే వా కదాచిన్నాయం భూత్వా భవి
తా వానభూయః। అజోనిత్యశ్శాశ్వతోఽయం పురాణో
నహన్యతే హన్యమానే శరీరే. 20.

అయం- ఈ యాత్మ; అజః- పుట్టుకలేనివాఁడు, నిత్యః- యెప్పుడునుండెడివాఁడు; శాశ్వతః- స్థిరరూపుఁడు; పురాణః-అనాదియైనవాఁడు; అయం- ఈ యాత్మ; కదాచిదపి- ఒకప్పుడును; న జాయతే-పుట్టఁడు; నమ్రియతే వా- మృతిఁబొందఁడు; అయం- ఈ యాత్మ; భూత్వా-పుట్టి; భూయః-మరల; నభవితా-కాఁగలవాఁడునుగాఁడు; అతః- ఈకారణమువలన; శరీరే- దేహము; హన్యమానేసతి- సంహరింపబడుచుండగా;నహన్యతే- చంపబడఁడు. కావున, జాయతే, అస్తి, వర్ధతే, విపరిణమతే, అపక్షీయతే. నశ్యతి, అనెడి షడ్వికారములు పరాత్మకు లేవని సిద్ధము.

ఈ ఆత్మ ఒకప్పుడును పుట్టఁడు, ఒకప్పుడును చావఁడు, ఒకప్పుడుండి మరల మరియొకప్పుడు ఉండనివాఁడును కాఁడు, మును

పుట్టక వెనుక వచ్చినవాడును కాడు. ఎందువల్ల ననగా ఇతడు పుట్టుక లేనివాడు, మరణము లేనివాడు, ఎల్లప్పుడును ఉండువాడు, అనాదియైనవాడు. శరీరము హతమైనను ఈ ఆత్మ హతుఁడు కాడు.

వేదావినాశినం నిత్యం య ఏన మజమవ్యయం।
కథం స పురుషః పార్థ కం ఘాతయతి హంతి కం. 21.

హే పార్థ- ఓయి అర్జునుఁడా; యః- ఏ పురుషుఁడు; ఏనం-ఈ యాత్మను; నిత్యం- ఏకరూపిగాను; అవినాశినం- అస్త్యభావవికారరహితునిగాను; అజం-పుట్టుక లేనివానిగాను, అవ్యయం-క్షయరహితునిగాను; వేద-యెఱుఁగుచున్నాఁడో; సపురుషః-ఆపురుషుఁడు; కం-ఎవ్వని, కథం-యెట్లు; ఘాతయతి-చంపించుచున్నాఁడు.

ఓ అర్జున! ఎవఁడయితే ఈ ఆత్మ నాశము లేనివాఁడనియు నిత్యుఁడనియు, పుట్టుక లేనివాఁడనియు, క్షయము లేనివాఁడనియు తెలిసికొనుచున్నాఁడో అట్టి పురుషుఁడు ఎట్లు ఎవనిచేత వధింపఁబడును? ఎట్లు ఎవని వధించును, అట్టివాఁడు తాను వధింపఁబడుటయు తానితరుల వధించుటయు అసంభవము.

వాసాంసి జీర్ణాని యథా విహాయ నవాని గృహ్ణాతి నరోఽపరాణి।
తథా శరీరాణి విహాయ జీర్ణా న్యన్యాని సంయాతి నవాని దేహీ.

నరః-మనుష్యుఁడు; యథా- యేప్రకారముగా; జీర్ణాని-శిథి

లములయిన; వాసాంసి- వస్త్రములను; విహాయ-విడిచి; నవాని-క్రొత్తలయిన; అపరాణి-ఇతరములయిన; వస్త్రాణి-వస్త్రములను; గృహ్ణాతి-ధరించుచున్నాడో; తథా- యాప్రకారముగా; దేహీ-యాత్మ; జీర్ణాని-శిథిలములయిన; శరీరాణి-దేహములను; విహాయ-విడచి; నవాని-క్రొత్తలయిన; అన్యాని-ఇతరములయిన; శరీరాణి-దేహములను; సంయాతి-పొందుచున్నాడు.

మనుష్యుఁడు ఎట్లు చినిగినవస్త్రములనువదలి క్రొత్తవస్త్రములను గ్రహించునో, అట్లు ఈయాత్మ జీర్ణములయిన దేహములనువదలి క్రొత్తదేహములను గ్రహించుచున్నాఁడు.

నైనంఛిందంతిశస్త్రాణి నైనం దహతి పావకః।
నచైనం క్లేదయంత్యాపో నశోషయతిమారుతః. ౨౩.

ఏనం- ఈ యాత్మను; శస్త్రాణి-ఆయుధములు; నఛిందంతి-ఛేదింపవు; పావకః- అగ్ని; ఏనం- ఈ యాత్మను; నదహతి-దహింపదు; ఆపః-ఉదకములు; ఏనం- ఈ యాత్మను; నక్లేదయంతి-తడపవు; మారుతః-వాయువు; ఏనం- ఈ యాత్మను; నశోషయతి- శోషింపజేయదు.

ఈ యాత్మను ఆయుధములు నఱుకఁజాలవు, ఇతని అగ్ని దహింపజాలదు, ఇతనినీళ్లు తడుపఁజాలవు, ఇతని వాయువు ఎండింపఁజాలదు.

అచ్ఛేద్యో ౽యమదాహ్యో౽య మక్లేద్యో౽శోష్య ఏవచ।
నిత్యస్సర్వ గతస్థాణు రచలో౽యం సనాతనః. 24.

అయం- ఈ యాత్మ; అచ్ఛేద్యః- ఛేదింపదగినవాడుకాడు; అయం- ఈ యాత్మ; అదాహ్యః- దహింప దగినవాడు కాడు; అయం- ఈ యాత్మ; అక్లేద్యః- తడపదగని వాడు; అశోష్యః- ఎండింపదగని వాడు; కావున, అయం- ఈ యాత్మ; నిత్యః- నశింపనివాడును; సర్వగతః- సర్వవ్యాపకుడును; స్థాణుః- సిద్ధ స్వభావుడును; అచలః-చలించనివాడును; సనాతనః-అనాదియైనవాడును.

ఈయాత్మ ఛేదింప నలవిగాడు, ఈతడు దహింప నలవిగాడు, తడుప నలవిగాడు, ఎండింపను నలవిగాడు. ఇతడు నాశములేని వాడు, అంతటను వ్యాపించియుండు వాడు; స్థిర రూపుడు, చలించని వాడు, అనాదియైనవాడు.

అవ్యక్తో౽య మచింత్యో౽య మవికార్యో౽య ముచ్యతే।
తస్మాదేవం విదిత్వైనం నానుశోచితు మర్హసి. 25.

అయం- ఈ యాత్మ; అవ్యక్తః- శ్రుతి, "నచక్షుషాపశ్యతి కశ్చనైనం" అనే శ్రుతివలనచక్షురాదులకగోచరుడు; అయం- ఈ యాత్మ; అచింత్యః, "యన్మనసానమనుతే" అనెడి శ్రుతి వలన మనస్సునకగోచరుడు; అయం- ఈ యాత్మ; అవికార్యః-

కర్మేంద్రియములకు విషయముకానివాడు; ఇతి- ఇట్లని; ఉచ్య తే- చెప్పబడుచున్నాడు; తస్మాత్ - ఆకారణము వలన; ఏవం- ఈ చెప్పబడిన ప్రకారముగా; ఏవం- ఈ యాత్మను; విదిత్వా- ఎఱిగి; అనుశోచితుం- దుఃఖించుటకొఱకు; నార్హసి- తగవు.

ఈ యాత్మ చక్షురాదీంద్రియములకు గోచరుఁడు గాఁడు, మనస్సునకును గోచరుఁడుగాఁడు, కర్మేంద్రియములకును ఏమి సేయను శక్యముగాడు అని శ్రుతులందుఁ జెప్పఁబడుచున్నాఁడు, కాబట్టి, నీవీప్రకారము తెలిసి దుఃఖింపకుము.

అథచైనం నిత్యజాతం నిత్యంవా మన్యసేమృతం।
తథాపిత్వం మహాబాహో నైవంశోచితుమర్హసి. 26.

హే మహాబాహో- ఓ అర్జునుడా; అథచ- ఆలాగునైన ను; త్వం-నీవు; నిత్యజాతం, నిత్యం-నిత్యమును; జాతం-పుట్టు చున్న; నిత్యా- నిత్యమును; మృతం-నశింపుచున్న దేహమును; ఏనం- ఈ యాత్మనుగా; మన్యసే-తలంచుచున్నావో; తథాపి- అట్లయ్యును; ఏవం- ఈ ప్రకారముగా; శోచితుం- దుఃఖించుట కొఱకు; నార్హసి-తగవు.

అట్లుగాక ఈ యాత్మ నిత్యముగా పుట్టువాడనియు, నిత్య ముగా నశించువాడనియు, నీవు తలంచినను ఆపక్షమునందు

గూడా ఓ. అర్జునుడా ఈ ఆత్మను గురించి నీవు దుఃఖింపవలసి నది లేదు.

జాతస్యహి ధ్రువో మృత్యుః ధ్రువంజన్మ మృతస్యచ।
తస్మాదపరిహార్యేర్థే నత్వంశోచితు మర్హసి.　　27.

హి- ఏ కారణమువలన; జాతస్య-పుట్టినవానికి; మృత్యుః- నాశము; ధ్రువః- నిశ్చయమో; మృతస్య-చచ్చినవానికి; జన్మ- పుట్టడమును; ధ్రువం-నిశ్చయమో; తస్మాత్-ఆకారణమువలన అపరిహార్యే- తప్పించగూడని; అర్థే- కార్యవిషయమై; త్వం- పండితుండవైన నీవు; శోచితుం- దుఃఖించెడికొఱకు; నార్హసి-తగవు.

ఎందువల్లననగా పుట్టినవానికి మరణముతప్పదు. అట్లు చచ్చినవానికి జన్మమునుతప్పదు. కాబట్టి అనివార్యమయిన ఈ విషయమునందు నీవు దుఃఖించుటచే నుపయోగము లేదు.

అవ్యక్తాదీని భూతాని వ్యక్తమధ్యాని భారత।
అవ్యక్తనిధనాన్యేవ తత్రకా పరివేదనా.　　28.

హే భారత- ఓయి అర్జునుడా; భూతాని-శరీరములు; అవ్యక్తాదీని- ప్రధానతత్త్వమె స్వరూపముగాగలవియు; వ్యక్తమధ్యాని- కనిపించుచున్నజన్మమరణాదులే మధ్యకాలమందు గలవియు; అవ్యక్తనిధనాని- ప్రధానతత్త్వమునందే లయముగాగల

వియోగ; తత్ర- అట్టి శరీర విషయమై; కా- ఏమి; పరివేదనా-దుఃఖము.

ఓ అర్జునుడా! ఈ భూతములు పుట్టుటకుమునుపు కనబడవు. నడుమమాత్రము కనబడుచున్నవి. పిమ్మట నశించిన యనంతరము అకనబడకనుండుటనే పొందును. కాబట్టి నీకీ విషయమునందు దుఃఖమేల?

ఆశ్చర్య వత్పశ్యతి కశ్చిదేన మాశ్చర్య వద్వదతి తథైవ చాన్యః। ఆశ్చర్యవచ్చైన మన్యశ్శృణోతి శ్రుత్వా ప్యేనం వేదనచైవ కశ్చిత్. 29.

కశ్చిత్ - ఒకానొక పురుషుడు; ఏనం- ఈయాత్మను; ఆశ్చర్యవత్ - ఒకప్పుడును జూడని అద్భుత వస్తువు నాకస్మికముగా జూచినట్లు; పశ్యతి-చూచుచున్నాడు: తథైవ-అట్లాగుననే; అన్యశ్చ-మరియొకడును; ఏనం- ఈ యాత్మను; ఆశ్చర్యవత్- ఆశ్చర్యమువలె; వదతి- మఱియొకనితో చెప్పుచున్నాడు. అన్యః-యితరుడు; ఏనం- ఈ యాత్మను; ఆశ్చర్యవత్- ఆశ్చర్యమువలె; శృణోతి-వినుచున్నాడు; కశ్చిత్-మరియొకడు; ఏనం-ఈ యాత్మను; శ్రుత్వాపి- వినియును; దృష్ట్వాచ- చూచియును; ఉక్త్వాపి-పలికియును; నవేదైవ-తెలియంగడు; అది యెట్లనిన జ్ఞానవాసిష్ఠమందు చెప్పబడియున్నది. "శ్లో. అహాహాను

చిత్రం మాయేయం యద్వావిశ్వవి మోహినీ । సర్వాంగస్త్రో తమప్యేనం యయాత్మానం నబుధ్యతే. ,, ఏమాయచేత లోకులు సకలావయవములయందునిండి యున్నప్పటికిని ఆత్మ తెలియలేక యున్నారో, ఆ ఈ మాయ ప్రపంచమును మిక్కిలి మోహింపజేయుచున్నది ఇది మిక్కిలి యాశ్చర్యము.

ఒకానొకడు ఈ ఆత్మను ఆశ్చర్యవస్తువువలె చూచును, మరియొకడు ఈ ఆత్మను ఆశ్చర్యమువలెనే చెప్పును, మరియొకడు ఆశ్చర్యముగా వినును వినియును ఈ ఆత్మను ఎవ్వడును యెఱుంగడు.

దేహీనిత్య మవధ్యోయం దేహే సర్వస్య భారత।
తస్మాత్సర్వాణి భూతాని నత్వంశోచితుమర్హసి. 30.

హే భారత- ఓయి అర్జునుడా; సర్వస్య- సమస్తమయిన; సురాసుర మనుష్యాది ప్రాణి సమూహముయొక్క; దేహే- శరీరము, మధ్యమానేపి- సంహరింప బడుచున్నను; అయం- ఈ; దేహీ-ఆత్మ; నిత్యం- ఎల్లప్పుడును; అవధ్యః- చంపదగనివాడు; తస్మాత్-ఆకారణమువలన; త్వం- నీవు; సర్వాణి- సమస్తమయిన; భూతాని-భీష్మాదిశరీరములనుగూర్చి; శోచితుం- దుఃఖించుటకొఱకు; నార్హసి- తగవు.

ఓ అర్జునుడా! ఈ దేహము హతమైనను ఈ దేహమునం

దుండు ఆత్మ ఎప్పుడును హతముకాదు. అందువలన ఈ భీష్మాదిసమస్తప్రాణులనుగూర్చి నీవు దుఃఖింపవలసినది లేదు.

స్వధర్మమపిచావేక్ష్య నవికంపితు మర్హసి।
ధర్మ్యాద్ధి యుద్ధాచ్ఛ్రేయోన్యత్ క్షత్రియస్య నవిద్యతే.

అపిచ- ఇంతేకాదు; స్వధర్మం- క్షత్రియ ధర్మమును; అవేక్ష్య-విచారించి; వికంపితుం- చలించుటకొఱకు; నార్హసి- తగవు; తథాహి- అదియుక్తమేకదా; క్షత్రియస్య- రాజునకు; ధర్మ్యాత్-ధర్మములోఁగూడిన; యుద్ధాత్ - యుద్ధమునకంటే; అన్యత్-ఇతరమయిన; శ్రేయః-శ్రేయస్సు; నవిద్యతే-లేదు.

ఇంతియకాదు, నీవు స్వధర్మమును విచారించినను ఈయుద్ధము విడువరాదని చెప్పుదును. ఏలయనగా ఈ ధర్మ్యమైన యుద్ధముకంటే మరియొకటి మేలుగలిగించు కార్యము క్షత్రియునకు లేదు.

అవతారిక. “స్వజనంహి కథం హత్వా సుఖినస్స్యామమాధవ.” అనెడి శ్లోకమున కుత్తరము జెప్పుచున్నాడు.

యదృచ్ఛయాచోపపన్నం స్వర్గద్వార మపావృతం।
సుఖినః క్షత్రియాః పార్థ లభంతే యుద్ధమీదృశం. 32.

హే పార్థ- ఓయి అర్జునుడా; యే క్షత్రియాః- ఏ రాజులు; అపావృతం- ఆవరణ రహితమైన; స్వర్గద్వారం- స్వర్గద్వారభూ

తమైనట్టి; యదృచ్ఛయా-అప్రార్థనచేత; ఉపపన్నం చ- ప్రాప్త మైనట్టి; ఈదృశం-ఇట్టి; యుద్ధం-యుద్ధమును; లభంతే-పొందు చున్నారో; తే-వారలు; సుఖినః- భాగ్యవంతులు.

ఓ అర్జునుడా! ప్రార్థింపకయే సిద్ధమైన తెరవబడిన స్వర్గము వాకిలియయిన ఈ యుద్ధమును పొందు క్షత్రియులు మిక్కిలి సుఖవంతులని చెప్పబడెను.

అథచేత్త్వం ధర్మ్యమిమం సంగ్రామం న కరిష్యసి।
తతస్స్వధర్మం కీర్తించ హిత్వా పాప మవాప్స్యసి. 33.

అథ-పిమ్మట; త్వం-నీవు; ధర్మ్యం- స్వధర్మయుక్తమైన; ఇమ్మం సంగ్రామం- ఈ యుద్ధమును; నకరిష్యసిచేత్- చేయవేని; తతః-అందువలన; స్వధర్మం-స్వధర్మఫలమును; కీర్తించ- యశస్సును; హిత్వా-విడిచి; పాపం-పాపమును; అవాప్స్యసి-పొం దగలవు.

అట్లైనను నీవు ఈ ధర్మ్యమైన యుద్ధమును చేయకపోదువే ని అందువలన స్వధర్మమునుయశస్సును కోరకపోవుటయే కాక పాపమును పొందుదువు.

అకీర్తించాపిభూతాని కథయిష్యంతి తేవ్యయాం।
సంభావితస్య చాకీర్తి ర్మరణా దతిరిచ్యతే. 34.

అపిచ- ఇంతియేకాదు. భూతాని- ప్రాణులు; అవ్యయం-